మానవీయతకు మల్లెపూదండ



# డా. కాసరనేని సదాశివరావు

# జీవన సాఫల్య అమృతోత్సవ

## ప్రత్యేక సంచిక





# మానవీయతకు మల్లెపూదండ

డాక్టర్ కాసరనేని సదాశివరావు

జీవన సాఫల్య అమృతోత్సవ

ప్రత్యేక సంచిక

2008

# సంపాదకీయం.....

మానవీయతకు మల్లెపూదండ
మహనీయతకు అక్షర కైదండ

ఆయన అపర ధన్వంతరీ స్వరూపుడు... ఆయన సాహితీ సదస్యులకు ఆత్మబంధువు. ఆయన నిత్య ఆరాధ్యనీయుడైన ప్రజాహితుడు... సౌహార్ధం ప్లస్ సౌమనస్యం ఇంటూ సౌశీల్యం మైనస్ అహంకారం ఈజ్ ఈక్వల్ టు డాక్టర్ కాసరనేని సదాశివరావుగారు. మట్టి వాసన పీల్చారు. పైరగాలికి తలలతో సైకతాలలో తుమ్మెదలా ఎగిరారు. ఎందరో ఆత్మీయుల ప్రేమామృతాలను ఆస్వాదించి ఎదిగారు. కష్టానికి అర్థంగా నిలిచారు. స్వయంకృషికి నిర్వచనం చెప్పారు. వైద్యవృత్తిని చేపట్టారు. లేటు చూడక జబ్బును నిర్మూలించారు. రాజకీయాన్ని సామాజిక కోణంలో చూశారు. అటు మంచి వైద్యునిగా, ఇటు నైతిక విలువలకు పట్టంకట్టిన రాజకీయవేత్తగా, సాహితీ సమర్చకునిగా.. ఓ పరిపూర్ణ పురుషునిగా నిలిచారు.

డాక్టర్ గారికి 85 ఏళ్లు నిండాయి. 86వ వసంతంలోకి పాదం మోపే సమయంలో చిలుకలు ఛిద్రమైపోయిన వర్తమానానికి ఓ మహనీయుని జీవితాన్ని ''పాఠంగా చెప్పడానికి ఒక మరోదాత్త మనీషికి అడుగుజాడగా రూపించడానికి'' డాక్టర్ సదాశివరావుగారి జీవన సాఫల్య అమృతోత్సవాన్ని 2008 అక్టోబర్ 11, 12, 13 తేదీలలో గుంటూరు నగరంలో ఆత్మీయంగా నిర్వహించారు. ఈ శుభసమయంలో '**మానవీయతకు మల్లెపూదండ**' అనే ప్రత్యేక సంచికను ఒక మధురజ్ఞాపికగా తీర్చిదిద్ది డాక్టరుగారి అభిమానులకు అపురూప కానుకలా అందిస్తున్నాం.

డాక్టరుగారు తమ అమృతహస్తాలతో వందలాది వైద్యశాలలను ప్రారంభించారు. ఆయన శిష్యప్రశిష్యులు దేశవిదేశాలలో వేలాదిమంది ఉన్నారు. వారి హృదయ స్పందనలను, అపురూపమైన చిత్రాలను సాధ్యమైనంత వరకు సేకరించాం. డాక్టరుగారి సూచనపై ఈ సంచికను ఒక సాహితీ మహతిగా తీర్చిదిద్దే ప్రయత్నం జరిగింది. కొత్త పాతల మేలికలయికగా వ్యాస ప్రచురణ జరిగింది. ఈ సంచిక ఒక సాహితీ విపంచికగా చిరస్థాయిగా నిలుస్తుందని ఆకాంక్షిస్తున్నాం.

సంపాదక మండలి

డాక్టర్ వెన్నిసెట్టి సింగారావు
డాక్టర్ కందిమళ్ల సాంబశివరావు
డాక్టర్ జెక్కంపూడి సీతారామారావు

## ఆదర్శమూర్తి డాక్టర్ కాసరనేని సదాశివరావు

## జీవన సాఫల్య అమృతోత్సవ సభలకు – నాందీ ప్రస్తావన

– డా. గడిపూడి వెంకటరాయుడు

ఆదర్శానికి నిలువెత్తు సాక్షీభూతులు, మానవతామూర్తి సాహితీ పిపాసి. డాక్టర్ కాసరనేని సదాశివరావుగారి స్వీయచరిత్ర '**సదాశివమ్** 'గ్రంథావిష్కరణ సభ గుంటూరు పట్టణంలో లక్ష్మీపురమందలి కాటన్ అసోసియేషన్ ప్రాంగణంలో ది. 16-2-2008 న నిర్వహించారు. ఈ సభకు ఆచార్య నాగార్జున.. విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సలర్, ప్రొఫెసర్ వి. బాలమోహన్ దాస్ అధ్యక్షత వహించారు. గ్రంథావిష్కర్తగా జస్టిస్ జాస్తి చలమేశ్వర్, గ్రంథ సమీక్షకులుగా ప్రొఫెసర్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ సభలో పాల్గొన్నారు.

సభా ప్రాంగణం డాక్టరుగారి శిష్యులు, అభిమానులతో నిండిపోయింది. కొంతమంది కూర్చోవడానికి. కుర్చీలు చాలక, నిలబడవలసి వచ్చింది. అలా నిలబడిన వారిలో నేను, అబ్బూరి వేంకటేశ్వరరావు, డాక్టర్. ఎన్. కిషోర్ పిచ్చాపాటి మాటల్లో పడ్డాం. ఈరోజు జరుగుతున్న ఫంక్షన్ డాక్టరుగారు చాలా ఉత్సాహంగా, ఉల్లాసంగా కనబడుతున్నారు. ఇంకో సందర్భంగా ఒక కార్యక్రమం భారీయెత్తున నిర్వహిస్తే డాక్టరుగారు సెంచరీ పూర్తిచేస్తారని అనుకొన్నాం.

ఈ గ్రంథావిష్కరణల సభలో ఆకస్మికంగా ప్రత్యక్షమైంది డాక్టర్ సురేష్. అందరం సంతోషించాం. వెంటనే మా ఆలోచనని డాక్టర్ సురేష్ గారితో పంచుకున్నాం. 'నా బర్త్ డే అక్టోబరు 10, నాన్నగారి పుట్టిన రోజు అక్టోబరు 13వ తేది' అని సురేష్ మాతో అన్నారు. ఆ తేదీనాటికి మీ కుటుంబసభ్యులందరూ వచ్చేటట్లు చూడండని వారిని మేము రిక్వెస్టు చేశాం. గ్రంథావిష్కరణ సభకు వచ్చిన కుటుంబ సభ్యులను డాక్టరుగారి జన్మదినోత్సవానికి కూడా రావాలని కోరాం.

తరువాత డాక్టరుగారితో ప్రస్తావించాం. వారు వద్దన్నారు. మీకోసం కాదు, మాకోసం ఒక పండుగ కావాలన్నాం. ఆయనకు సన్నిహితులు డాక్టరు జెక్కంపూడి, అబ్బూరి వేంకటేశ్వరరావు గారలను తోడుగా తీసికెళ్లాను. డాక్టరు జెక్కంపూడి వారు మాటాడగా పెద్దాయన మెత్తబడ్డారు. చివరగా డాక్టరుగారిని ఎక్కువగా అభిమానించే వికాస్ విద్యాసంస్థల డైరెక్టర్ శ్రీ పి.వి. శంకరరావును డాక్టరుగారి దగ్గరకు తీసికెళ్లాను.. పెద్దాయన డాక్టరుగారు మౌనం వహించారు. ఆ మౌనాన్ని అంగీకారంగా భావించి, మేము కార్యరంగంలోకి దిగుతున్నామని వారికి తెలియజేశాం. డాక్టరుగారి దగ్గరనుండి బయటకు వచ్చాక ఈ కార్యక్రమాన్ని భుజాన వేసుకోవాలని శంకరరావు గారితో అన్నాను.

వికాస్ కళాశాలలో సమావేశమై చిలకలూరిపేట నుండి వచ్చిన డాక్టర్ కందిమళ్లతో అక్టోబర్ 13న డాక్టరు సదాశివరావుగారి జన్మదినం వస్తుంది. ఇంతకు పూర్వమే డాక్టరుగారి గ్రామస్థులు. సహస్ర చంద్రదర్శన మహోత్సవం జరిపి, వారి పేర నాటక కళాపరిషత్తు ఏర్పాటుచేసి, క్రమంగా పోటీలు నిర్వహిస్తున్నారు. కాబట్టి 2008 అక్టోబరు 13వ తేదీ – 86 వ జన్మదినోత్సవానికి చక్కని నామకరణం చేయాలని కోరాను. డాక్టర్ కందిమళ్ల సాంబశివరావు, డాక్టర్ సింగారావు, డాక్టర్ జెక్కంపూడి, వికాస్ శంకరరావు గారలు కలసి '**డాక్టరు కాసరనేని సదాశివరావు జీవన సాఫల్య అమృతోత్సవ సభలు**' అని కొత్త పేరు సూచించారు.

ఇక ఈ సందర్భంగా డాక్టరుగారు సాహితీప్రియులు కాబట్టి ఒక సావనీర్ కూడా ప్రకటించాలని శంకరరావు సూచించారు. డాక్టరుగారు మానవతావాది, తప్పనిసరిగా ఆ సావనీర్ కు మానవత లేదా మానవీయత అనే పేరు ఉండాలన్నారు. చివరకు '**మానవీయతకు మల్లెపూదండ**' పేరు సిద్ధపరచారు.

కార్యక్రమ నిర్వహణకై అజాతశత్రువైన డాక్టర్ మద్దినేని గోపాలకృష్ణగారిని అధ్యక్షులుగా వ్యవహరించాలని కోరాం. వారంగీకరించారు. సావనీర్ లో ప్రచురించడానికి రచనలు కోరడానికి వికాస్ విద్యాసంస్థల అడ్రస్ ఇవ్వాలనుకున్నాం.

నిర్వహణ కమిటీ విషయమై ఆలోచించాం. కార్యదర్శిగా నేను, కోశాధికారిగా అబ్బూరి వేంకటేశ్వరరావు మరి గౌరవ సలహాదారులుగా బొల్లేపల్లి సత్యనారాయణ, డాక్టర్ జెక్కంపూడి సీతారామారావు, డాక్టర్ కిషోర్, డాక్టర్ కందిమళ్ల సాంబశివరావు, డాక్టర్ వి. సింగారావు గార్లను, కన్వీనర్ గా పి.వి. శంకరరావు ఉండాలని అందరూ అంగీకరించారు.

సావనీర్ కార్యక్రమం చూడవలసిందిగా డాక్టర్ కందిమళ్ల, డాక్టర్ ఐ. సింగారావు, డాక్టర్ జెక్కంపూడి గారలను కోరాను. అమృతోత్సవ సభల కార్యక్రమం మూడు రోజులు: అక్టోబర్ 11వ తేదీన ఇండియన్ మెడికల్ అసోసియేషన్లో ఒక సెమినార్, 12వ తేదిన శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానంలో సాహిత్యసదస్సు, 13వ తేదీన పాటిబండ్ల సీతారామయ్య హైస్కూలులో ప్రధాన కార్యక్రమమైన 86వ జన్మదినోత్సవం నిర్వహించాలని తలపెట్టాం.

విద్య, వైద్య, సాహిత్య, రాజకీయ రంగాలలోని ప్రముఖులను సన్మానించడం – తరువాత ప్రతి సంవత్సరం డాక్టరుగారి పుట్టిన పండుగ రోజున ఎండోమెంట్ ప్రసంగాన్ని నిర్వహించి, ప్రముఖులను సన్మానించడానికి నిర్ణయించాం. ఈ విధంగా అందరు మా డాక్టరుగారని సగర్వంగా పిలుచుకొనే డాక్టరు కాసరనేని సదాశివరావు గారి జీవన సాఫల్య అమృతోత్సవానికి నాందీ ప్రస్తావనలు పలకడం జరిగింది.

# ఎందరో మహానుభావులు, అందరికి వందనములు

– డాక్టర్ మద్దినేని గోపాలకృష్ణ

Dr. Kasaraneni Sadasiva Rao గారి జీవన సాఫల్య అమృతోత్సవానికి అందరికి స్వాగతం, సుస్వాగతం.

డాక్టరుగారికి ఈ రోజు 85 సంవత్సరములు నిండిన శుభసమయమున వారి సన్నిహితులు, వారి సేవలవల్ల ఆరోగ్యపరంగా, సమాజపరంగా లబ్దిపొందినవారు, వారి శిష్యులు, వారి కుటుంబ సభ్యులు ఈ అమృతోత్సవాన్ని యేర్పాటుచేసినారు. శనివారము సాయంకాలము Indian Medical Association, Guntur Branch వారు డాక్టర్ గారికి పెద్ద Felicitation Function జరిపారు. Professor Kadiyala Vasudeva Rao , Dr. Sadasiva Rao గారు, Dr. Jayapradamba గార్ల విశిష్ట వ్యక్తిత్వము వారు వైద్యవృత్తికి చేసిన సేవలు L.C.D. Projection Presentation చేసినారు. గుంటూరు డాక్టర్లందరు వారిని పూలమాలతో గౌరవించి వారితో ఫోటోలు తీయించుకొని వారిచ్చిన సందేశాన్ని శ్రద్ధగా విని, వారికి శుభాకాంక్షలు తెలిపి, పాదాభివందనం చేసి విందు ఆరగించారు. ఈ సభలో 'వైద్యుడు – రోగి సంబంధపు ప్రాధాన్యత' వివరంగా చెప్పారు.

నిన్నటి రోజు సాయంత్రం బృందావన్ గార్డెన్స్ లోని శ్రీవెంకటేశ్వరస్వామి దేవాలయ ప్రాంగణంలో గల అన్నమయ్య కళావేదికపై

**సాహితి సదస్సు:**

ఆచార్య S. Gangappa గారి అధ్యక్షతన జరిగినది. హృద్యమైన తెలుగు పద్యం అనే అంశము మీద Dr. V.V.L. Narasimha Rao గారు ప్రసంగించారు. మంగళగిరి ఆదిత్యప్రసాద్ గారు సుగమమైన తెలుగుపాట గురించి చక్కగా వివరించారు. ఈ రోజు October 13వ తారీఖు వారి జన్మదినము. 85 వసంతాలు పూర్తి చేసుకున్నారు. ఈ శుభసమయాన డాక్టరుగారికి అందరి తరపున శుభాకాంక్షలు తెలుపడానికి ఈ జీవన సాఫల్య అమృతోత్సవము శ్రీపాటిబండ్ల సీతారామయ్య హైస్కూలు ఆవరణలో జరుపుతున్నాము. డాక్టరు గారు Andhra Medical College, విశాఖపట్టణంలో M.S. General Surgery లో Gold Medal తో ఉత్తీర్ణులయ్యారు. వారి సతీమణి డాక్టర్ జయప్రదాంబ గారితో కలసి 1951 June 22వ తారీఖున గుంటూరు Sambasiva Peta Peoples Nursing Home లో Private Medical Practice ప్రారంభించారు. Family Doctors గా పెద్దలకు, స్త్రీలకు, పిల్లలకు అన్నిరకములైన వైద్య సేవలనందించేవారు. Operations చేసి వ్యాధులను నయము చేసేవారు. వారు చేసిన వైద్య సేవలు నిస్వార్ధమైనవి. కొంతమంది యువ డాక్టర్లు. Medical Students వారివద్ద Apprentice చేసి Observers "గా పనిచేసి Private Medical Practice ఎలా చెయ్యాలో నేర్చుకొని వారి చేతులమీద వారి అమృత హస్తాలతో Ribbon Cut చేయించి Practice మొదలు పెట్టేవాళ్ళు. ఇలా ఎన్నో వందలు Hospitals Open చేశారు. Hospital లో 15 సంవత్సరాలు Honorary Surgeon గా వున్నప్పుడు Postgraduates in M.S. General Surgery Senior House Surgeons m పనిచేసి ఎన్నో ఉన్నత పదవులలో Eminent and Efficient Doctors గా, మన రాష్ట్రంలో, మన దేశములో ఇతర దేశాల్లో ముఖ్యంగా United States of America. United Kingdom లో స్థిరపడియున్నారు.

డాక్టరుగారు వైద్యంతోపాటు సంఘసేవకు Social Service కు యెంతో ప్రాధాన్యము యిచ్చేవారు. పల్లెటూర్లలో High School Students Medical examination చేసి పిల్లలకు వైద్య సలహాలు యిచ్చేవారు.

విద్యారంగంలో శ్రీ పాటిబండ్ల శీతారామయ్య హైస్కూలుకు శ్రీనివాసరెడ్డి సీతాపతి గారితో కలసి విరాళాలు సేకరించి స్కూలు భవనం నిర్మించారు.

వారి షష్టిపూర్తి ఉత్సవము ఈ ప్రాంగణములోనే జరిగినది. ఎందరో పెద్దలు వారి సేవలను అభినందించారు.

ఈ ఉత్సవము కూడా ఈ ప్రాంగణములోనే జరగాలని వారే నిర్ణయించారు.

1967 Nagarjuna Education Society Register చేయించి శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి కళాశాలను 1968లో మొదలుపెట్టారు. తరువాత మిగతా విద్యా సంస్థలు Nagarjuna Education Society ఆధ్వర్యంలో చాలా efficient గా పనిచేస్తున్నాయి. J.K.C కాలేజికి NAAC A grade వచ్చినది.

జాగర్లమూడి చంద్రమౌళిగారి తర్వాత వారు President Nagarjuna Education Society యెన్నెన్నో సేవలందించారు. వారు President గా ఉన్న కాలంలో రాయపాటి వెంకట రంగారావు, జాగర్లమూడి చంద్రమౌళి College of Engineering R.V.R. & J.C. College of Engineering బాగా అభివృద్ధి చెందినది.

1998లో National Board of Accreditation A garage status job. Andhra Pradesh Private Engineering Colleges లో ప్రథమస్థానం వహించింది.

సాహితీ సదస్సు అనేపేరుతో యువ రచయితలకు, కళాకారులకు ప్రతి మాసము సభలను యేర్పాటు చేసి వారికెంతో ప్రోత్సహమిచ్చారు.

వారియింట్లో పెద్ద Library ని ఏర్పాటు చేశారు. Democratic Country లో రాజకీయంగా సమాజం బాగా నడవాలంటే – మంచి వ్యక్తులు రాజకీయంలో చేరి సేవలందించాలన్న వారి అభిప్రాయాన్ని అందరికి చెప్పేవారు. రాజకీయ నాయకులతో పరిచయమేర్పరచు aya Bank కుని రాజకీయంగా ముఖ్యపాత్ర వహించి M.L. A. గా ఒక Term వున్నారు. వారి నియోజకవర్గం పెదకూరపాడుని బాగా Develop చేశారు.

Dr. Jayapradamba స్వర్గస్తులైన తర్వాత Jayapradamba స్మృతి చిహ్నంగా Dr. Kasaraneni Jayapradamba Education Trust ను యేర్పాటు చేసి Dr. JayaPradamba Degree College నడుపు తున్నారు. ఆడ పిల్లలకు Hostel Bhavanam నిర్మించారు. వచ్చే విద్యా సంరము నుండి Junior College కూడా నడపాలని ప్రయత్నం చేస్తున్నారు. వారి Auto Biography నా జీవన ప్రస్తానము– 'సదాశివం' అనే పేరుతో పుస్తకం వ్రాశారు వారి మునిమనవడు పేరుతో. Sada means Always, Sivam od Auspicious.

డాక్టరు సదాశివరావు గారు జీవితంలో యెన్నో ఉన్నతాశయాలతో మనందరిని ప్రేరేపించి, ఉన్నత వ్యక్తిగా మనందరికి 'Roll Model" గా సామాజికాభివృద్ధికి కృషిచేస్తూ, వైద్యరంగంలో పెద్ద డాక్టరుగా, విద్యారంగంలో విద్యావేత్తగా, సాహితీరంగంలో సాహితీవేత్తగా, రాజకీయ నాయకుడుగా, మన గుంటూరు పట్టణంలో ప్రముఖవ్యక్తిగా, మనందరికి ఈ అమృతోత్సవం జరపడం యెంతో సంతోషం. వారు ఆరోగ్యంగా ఉండి, సమాజాన్ని ముందుకు నడపాలని భగవంతుని ప్రార్థించుచున్నాను.

**వైద్యునిగా**
**ఉపాధ్యాయునిగా**
**విద్యాదాతగా**
**ప్రజాప్రతినిధిగా**
**అసమాన సేవలందించిన**
**అమృత మూర్తి.**

Dr. Kasaraneni Sadasiva Rao గారికి గుంటూరు ప్రజల తరపున 86వ జన్మదిన శుభాకాంక్షలు అందచేస్తున్నాను.

Invoke the blessings of Lord Venkateswara
ఓం తత్ సత్
ఓం శాంతి, శాంతి, శాంతిః
జైహింద్.

# ప్రశంస.....

కొందఱు భావుకుండనియు, కొందఱు మంచి రసజ్ఞుడంచు వా
కొందురు, వైద్యలోకమునకున్ తలమానికమందు రండజున్
ఎందఱో 'హితప్రియుడటే' యన్ని కన్నుల కట్టకొందు రీ
చందములన్ని మీ హృదయ సంస్కృతికెత్తు పతాకలే కదా!

*– శ్రీ చిన్నము రామయ్య చౌదరి*

కాసరనేని దంపతులు కాసులకంటెఁ బ్రజాసపర్యకున్
వాసియొసంగి రేపవలు వందురు వందల వేల రోగులున్
గాసికి డవ్వొనర్చి నవకాంతి సమగ్రులఁజేసి ధన్యతా
భాసురులౌట సజ్జనుల పాలిటికిన్ శుభవార్తయై తగున్.

*– తెనుఁగులెంక*

గుంటూరు ప్రాంతమందు జనకోటి సదాశివరాయ! నిన్ను నిం
టింటను సేవతో వెలుగులీను సదాశివమూర్తి నందురే
గంటలు కొట్టి పల్కెడ సగర్వముగా నది ఎల్లవేళ నీ
వంటి రసజ్ఞు మెచ్చెదను వర్ధిలుమయ్య చిరాయుదున్నతిన్.

*– డాక్టర్ ప్రసాదరాయకులపతి.*

వైద్యశాస్త్రమందు వర్ణనకెక్కిన
గౌరవమ్ము మిగుల కలదు నీకు
ప్రాణదాన మొసగు బాధ్యతలో, గొప్ప
పేరు కొందరికే లభింపగలదు!

*– శ్రీ కొసరాజు రాఘవయ్య చౌదరి.*

బోనము చేయువేళ కవిపుంగవులాప్తులు బంధుమిత్రులా
స్థానమునందునుండి వరుసన్ భుజియింతురు,
మెచ్చులొచ్చులం
బూనరు, వారు వీరనెడి పుంతలఁ ద్రొక్కరు, కల్మిలేములం
గానేరు సత్యకాదృతులు గల్గిన కాసరనేని దంపతుల్.

*– శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు*

సరసుడు, సాహితీరతుడు, సాగరమేరుగభీరధీరుడా
సురగుణ మించుకన్ గొనని శుద్దగుణాత్ముడు సాధు సత్యవీ
శ్వర సుకళావిదరణశాలి, సదాశివరావు సద్విష,
గ్వరుడు శతాదికాబ్దములు వాసిగమించుఁ బరోపకారియై.

*– శ్రీ సుఖవాసి మల్లికార్జునరాయశాస్త్రి*

అతడు సామాన్యుఁడా! యేమి? యావదాంధ్ర
దేశ దేశిక ప్రవర విధేయుఁడైన
శ్రీసదాశివరావు సుస్థిరయశుండు
శ్రీమతి జయప్రదాదేవి నోముపంట.

*– శ్రీ బొద్దులూరి నారాయణరావు*

భాసుర వైద్యపట్ట పరిపాలన భాసుడు, సాహితీ రసో
ల్లాసుడు, మాతృదేశ సువిలాస విలాసుడు, దుర్జనైక రు
ర్వ్యాసుడు, సత్కవీంద్ర జనరంజక రమ్యగుణైకవాసుదున్
వ్యాసుడు, చంద్రికా ధవళహాసుడు – కాసరనేని యీశుడా.

*– శ్రీ బండ్లమూడి సత్యనారాయణ*

అతనొక సంస్థ వ్యక్తిత్వమాత్మనెంచ
శక్తియై నిల్చు నిత్య మేసంస్థకేని
జనత మెచ్చిన నేత సౌజన్యమూర్తి
స్నిగ్ధయశుడు డాక్టరు సదాశివుడు నిజము.

*– శ్రీ అబ్బరాజు శ్రీనివాసమూర్తి*

అనుపమ సద్గుణాంచిత మహాహృదయాన్వితవర్తన ప్రభా
జనిత యశోనిదానయుత సత్కవి సన్నుత చిత్తసంయుతా
వినయ విశేష భావపరివేష్టిత భూరిరసజ్ఞవార స
జ్ఞానయుత దివ్యభాగ్యఖని కాసరనేని మనీషి యెయ్యెదల్.

*– శ్రీ ఎం.వి.ఆర్. కృష్ణశర్మ*

శ్రితవత్సల! మహితగుణో
న్నత! అగదంకారలోకనైకవిధ ప్ర
స్తుతిపాత్ర! లోకచణ! సం
తతకావ్యవినోద! శ్రీ సదాశివరాయా!

*– శ్రీ బోడేపూడి వేంకటరావు*

వచ్చినవారి కెల్లరకు వైద్యమొనర్చి సుఖంబు గూర్చి, వా
రిచ్చిన రొక్క మిబ్బడిగా నిచ్చితిరించు వరించి కొంత యీ
వచ్చిన మెచ్చి పుచ్చుకొని, వారి సెబాసని మానసమ్ములో
నచ్చెరువంది మెత్తురట! ఔర! సదాశివరావు నీవికిన్.

*– శ్రీ చలసాని లక్ష్మీనారాయణవర్మ*

## విషయసూచిక

# గురుదక్షిణ

డా॥ ఎన్.కె. హరనాథబాబురెడ్డి
కమలా నర్సింగ్ హోం, నరసరావుపేట

గురుదేవులు, పూజ్యపాదులు డా సదాశివరావు గారి శిష్యకోటిలో నేనూ ఒకణ్ణి కావడం నా అదృష్టం. వారి సాంగత్యం, వారి శిక్షణ 42 సంవత్సరాలు అయినా నిరంతరం నా మనస్సులో తీయగా మెదలుతూ ఉన్నాయి.

అది 1966 వ సంవత్సరం, జూన్ నెల. గురువు గారి దగ్గర అప్పటికి మూడు సంవత్సరాల ట్రైనింగ్ పూర్తి అయింది. ఆయన దగ్గర సెలవు తీసుకునే టప్పుడు గురు దక్షిణ విషయం ప్రస్తావించాను. దానికి గురువు గారు ఎంతో అర్థంగా స్పందించారు. "నేను ఇప్పుడు నీకు శిక్షణ ఇచ్చాను. నా వైద్య విద్యానుభవాన్ని ముఖ్యంగా శస్త్రచికిత్సనుభవాన్ని నీకు అందించాను. నా విద్య నాతో ఆగకుండా ముందు తరానికి అందాలన్న ఉద్దేశంతో ఇలా చేశాను. ఇది ఇలాగే జీవనదిలా సాగిపోవాలి. నీవు కూడా నేను అందించిన కాగడాని ధనాపేక్ష లేకుండా నీ జూనియర్లకు అందించు. ఇదే నీవు నాకు ఇవ్వవలసిన గురు దక్షిణ" అన్నారు.

గురువుగారి విశాల హృదయానికి నేను ఎంతో సంతో షించాను. వారి ఉపదేశాన్ని శిరసావహించాను. ది. 22-7-1966 న మా నర్సింగ్ హోంను గురువుగారు తమ అమృతహస్తాలతో ప్రారంభించారు; నన్ను ఆశీర్వ దించారు. వారి ఆశీస్సుల వల్ల మా నర్సింగ్ హోం దిన దిన ప్రవర్ధమానమైంది. ఎందరో వ్యాధిగ్రస్తులకు చికిత్స చేశాను, చేస్తున్నాను. ఇదంతా ఒక ఎత్తు.

వారు చెప్పినట్లుగానే దాదాపు 30 మంది సోదర వైద్యులకు ధనాపేక్ష లేకుండా నా సహకారాన్ని అందించాను. గురువుగారు నాకు అందించిన అనుభవానికి, నా అనుభవాన్ని జోడించి వారికి మార్గదర్శిగా ఉన్నాను. ఒక్కొక్కరికి మూడు సంవత్సరాలు మాత్రమే ఈ సహ కారాన్ని అందించాను. మూడు సంవత్సరాల వ్యవధిలో వారు వైద్యవిద్యలో రాణించలేకపోతే ఇక వారు రాణిం చడం కష్టమని నా అభిప్రాయం. కాని నా శిక్షణను స్వీకరించిన వారంతా చక్కగా రాణించడం నాకు ఆనంద దాయకమైన విషయం. నా సహకారాన్ని పొందిన వైద్య సోదరులు నరసరావుపేట, చిలకలూరిపేట, సత్తెనపల్లి, నకరికల్లు, పిడుగురాళ్ల, సంతమాగులూరు, వినుకొండ, తెనాలి మొదలైనచోట్ల ఉత్తమ వైద్యులుగా ప్రసిద్ధ లయ్యారు. ఇలా గురువుగారికి యథాశక్తి గురు దక్షిణ సమర్పించుకున్నాను. అయినా గురు ఋణం పూర్తిగా తీర్చుకోవడం అసాధ్యం.

"సజ్జనుల విద్య జ్ఞానం కోసం, ధనం దానం కోసం, బలం ప్రజారక్షణ కోసం" అన్నారు పెద్దలు. మా గురు వర్యులు డా॥ సదాశివరావుగారి విద్య, జ్ఞానం కోసం అంకితమైంది. బలం ప్రజారక్షణ కోసం అంకితమైంది. ఆయన విద్య నీటిమీది నూనె బొట్టు లాగా వ్యాపించింది. వారు తమ ధనాన్ని కూడా విద్యా వ్యాప్తి కోసం అధికంగా వినియోగించారు.

మహనీయులైన మా గురువుగారికి ఈ జీవన సాఫల్య అమృతోత్సవ సందర్భంగా నా శుభాభినందన పూర్వక అభివందనాలు.

# గురువుగారి నుండి నేర్చుకున్నది

డాక్టర్ దొప్పలపూడి మల్లికార్జునరావు
(పీపుల్స్ నర్సింగ్ హోం–బాపట్ల):

నేను మొదటి సంవత్సరము యమ్.బి.బి.యస్ చదువుచున్నప్పుడు మా గురువుగారైన డాక్టర్ సదాశివరావుగారు మా కాలేజి మేగజైన్ లో రాసిన వ్యాసాన్ని చదివి నేనెంతో ప్రభావితుడనైనాను. ఆ వ్యాసములో మెడికల్ ప్రాక్టీషనరు ఏ పద్ధతులు. అవలంభించాలి, ఎలా విజయవంతమైన ప్రాక్టీషనరు కాగలరు – అని ఈ వ్యాసాన్ని ప్రతియొక్క మెడికల్ ప్రాక్టీషనరు చదివి ఆచరించాలి.

1963వ సంవత్సరములో నేను మూడవ సంవత్స రము యమ్.బి.బి.యస్ చదువుచున్నాను. అప్పుడు మా గురువు గారు మెడికల్ కాలేజీలో ఆనరరీ ప్రొఫెసర్గా పనిచేస్తున్నారు. మాకు ప్రిన్సిపల్స్ ఆఫ్ సర్జరీలో లెక్చరు ఇచ్చేవారు. ఆ లెక్చర్సు ఎంతో ప్రాక్టికల్గా వుండేవి. ఆ లెక్చర్సు నా జీవితములో ఎంతో వుపయోగ పడ్డవి. మేమంతా గురువుగారు చెప్పే విషయాలు పుస్తకములో వ్రాసుకునే వారము. అప్పటి క్లాసులో జరిగిన సంఘటనలు ఇప్పటికి నాకళ్ళముందె వున్నట్లు అనిపిస్తుంది. క్లాసుకు రాగానే గురువుగారు కొందరు స్టూడెంటుని లేపి అంతకు ముందు క్లాసులో విషయాలపై ప్రశ్నలు వేసేవారు. ప్రతి ఒక్కరు తనను లేపి ప్రశ్నలు వేస్తారేమోనని ఎంతో విజిలెంటుగా వుండేవారు. సమాధానము చెప్పకపోతే తక్కిన విద్యార్థులు తనను తక్కువగా భావిస్తారని భయముండేది. అందువల్ల ప్రతి ఒక్కరు అంతకుముందు క్లాసులో చెప్పిన విషయాలు బాగా చదివి వస్తారు. ప్రతి నెల, క్లాసులో చిన్నవ్రాత పరీక్ష పెట్టేవారు. ఆ పేపర్లు తనే స్వయంగా దిద్దేవారు. దానిలో ఏమైనా తప్పులు రాస్తే పేపరు చేతికి ఇచ్చే సమయములో ఆ తప్పును గురించి ఆ స్టూడెంటుకు వివరించేవారు. ఒక పర్యాయము నా పేపరు చేతికిస్తూ నీవు ప్రైమరీషాక్ ప్రశ్నకు సమాధానము తప్పుగా వ్రాశావని పేపరులో చూపించారు. ఒక పర్యాయము– నాకు ఇప్పటికి నా కళ్ళముందు కనిపిస్తుంది, నన్ను లేపి చేతిలోవున్న డెండ్రాన్నీట్సును గురించి వివరించమన్నాడు. నేను వివరిస్తున్నాను, కాదు నీవు బోర్డు దగ్గరకు వచ్చి బొమ్మ వేసి చూపమన్నారు. నేను నా చేతిని బోర్డుపై వుంచి, డెండ్రాన్ ట్సును గీచి చూపించాను. దానికి మా గురువుగారు ఎంతో సంతోషించారు. ప్రతి విషయము ఎంతో ప్రాక్టికల్గా చెప్పేవారు. క్లాసు మొత్తాన్ని ఒక ప్రశ్ననే వేశారు. నీవు డాక్టరయిన తరువాత ప్రైమరీ హెల్త్ సెంటరులో పనిచేస్తున్నపుడు హైడ్రోసీల్ ఆపరేషన్ చేయవలసి వస్తుంది. అక్కడ కరుగేటెడ్ రబ్బరు ట్యూబు దొరకదు. అప్పుడు ఏమి చేస్తారని అడిగారు. క్లాసులోవున్న 100 మందిలో ఏ ఒక్కరు సమాధానము చెప్పలేదు. గురువుగారు ఇలా చెప్పారు. ట్యూబుకు బదులు గాజు పీసును డ్రయినేజ్ వుపయోగించవచ్చని చెప్పారు. నేను హైడ్రోసీల్ ఆపరేషన్ చేసే సమయములో గురువుగారు. చెప్పిన విషయాలు గుర్తుకొచ్చేవి. నేను చాలాసార్లు గాజునే డ్రయినేజి ట్యూబు గా ఉపయోగించేవాడను. ఇలా అనేకమైన ప్రాక్టికల్ విషయాలు చెప్పేవారు. అవి మా జీవితములో ఎంతగా నో వుపయోగపడేవి.

నేను కొందరు మెడికల్ స్టూడెంట్స్ ఎక్కువ రోజులు సాయంత్రము గురువుగారి నర్సింగ్ హోంకు వెళ్ళే వాళ్ళము. నర్సింగ్ హోంలో ఎంతో ఆప్యాయంగా మాట్లాడేవారు. ఎన్నో విషయాలు చెప్పేవారు. చాలా సింపుల్గా వుండేవారు. ఒక్కొకప్పుడు రోగిని పరీక్ష చేసే సమయములో కాంపౌండరు వుండరు. అప్పుడు తనే రోగికి బి.పి. ఆపరేటస్ కట్టి చూడడము, పేషెంటుకు ధర్మా మీటరు పెట్టి జ్వరము చూడడము చేసేవారు. ఇంత పెద్ద వారయివుండి ఇలాంటి పనులు చేయడము నాకెంతో ఆశ్చర్యంగా వుండేది. ఇది ఎంతో ఆదర్శంగా నేను. భావించి తరువాత నా ప్రాక్టీస్లో అలానే చేసేవాడను.

నాకు బాగా గుర్తుంది. ఒక్కొక్కప్పుడు ఆపరేషన్ చేసిన పేషెంటును స్ట్రెచ్చర్ మీదకు మార్చే సమయములో, కాంపౌండర్లు తక్కువైతే తనే ఆ పేషెంటును స్ట్రెచ్చరై పై ఎత్తిపెట్టేవారు. ఇది నా జీవితంపై గొప్ప ప్రభావము చూపించింది. దీనివల్ల నాకు ఆపరేషన్ చేసినంత తృప్తి వుండేది. ఇది మా గురువుగారినుండి నేర్చుకున్నది. నేను నా జీవితములో ఆచరిస్తున్నాను.

ఒకరోజు గురువుగారు మెడికల్ స్టూడెంట్స్ అయిన మేము మాట్లాడుకొంటున్నాము. ఇంతలో ఒక రోగి డాక్టర్ సింగ్ దగ్గర వైద్యము చేయించుకొని తగ్గకపోతే గురువుగారిచే పరీక్ష చేయించుకొనుటకు వచ్చి గురువు గారికి డాక్టరు సింగ్ గారు వాడిన మందుల చీటి ఇచ్చినారు. ఆ చీటి చాల పొడవుగావుంది. దానిమీద 25 రకాల మందులు వ్రాయబడివున్నవి. గురువుగారు. ఈ మందులు ఎలా వేసుకుంటున్నావని అడిగారు. "ఏముందండి ప్రొద్దున లేచినప్పటి నుండి పండుకోపోయే వరకు మందులు వేసుకోవడమె సరిపోతుంది" అని అన్నాడు. అప్పుడు గురువుగారు ఇలా అన్నారు. డాక్టరు, మందులు చాల పరిమితంగా వ్రాయాలి. వారు ఖర్చుపెట్టే డబ్బు మన డబ్బుగా భావించాలి. ఎవరైనా డాక్టరు మందుల చీటీ చూసినా వెంటనే వలనా జబ్బుకు మందులు ఇస్తున్నారని అనుకోవాలి. ఈ మాటలు నా జీవితములో నేను అనుసరిస్తున్నాను.

ఒకరోజు నేను గురువుగారు మంగళగిరి దగ్గర వున్న పెనుమాకకు పెండ్లికి వెళ్ళినాము. ఆ పెండ్లి మా క్లాస్మేట్ కోటేశ్వరరావుది. గురువుగారికి కూడా తెలుసు, పెనుమాక వెళ్ళిన వెంటనే నేను, గురువుగారు కోటేశ్వర రావు దగ్గరకు వెళ్ళి కనపడి పెండ్లి ఎప్పుడో రాత్రి 2-45 నిమిషాలకు అప్పటివరకు వుండలేము. భోజనము చేసి వెళ్తామని చెప్పినాము. అక్కడ చాలా వొత్తిడిగావుంది. సీటు సంపాదించటానికి ఎంతో కష్టపడాల్సి వచ్చింది. నేలమీద పొడవాటి తాటి ఆకులు చాపవేసి వుంది, చాప మీద నేను గురువు గారు కూర్చున్నాము. స్థలము చదరంగా లేదు, ఇస్తరు వేస్తే గుంటల్లో వేసినట్లుంది. అలా ఆ ఇస్తర్లో భోజనము చేసినాము. గురువుగారు. ఎంతో గొప్ప డాక్టరయినా అక్కడ సామాన్యుడుగానే వున్నారు. భోజనము చేసే సమయములో గాని ఆ తరువాత మేము కారులో వెళ్ళే సమయములోగాని గురువుగారిలో ఎలాంటి ఫీలింగ్ కనపడలేదు. నాకు అప్పుడనిపించింది, ఆదర్శమంటే ఇదే. ఇదే ఆదర్శాన్ని నా జీవితములో కూడా అనుసరించాలి...

చిన్నతనములో నా తల్లిదండ్రుల నుండి నేర్చుకున్న మంచి లక్షణాలు విద్యార్థిగా మా గురువుగారి దగ్గర నుండి నేర్చుకున్న మంచి లక్షణాలు నా జీవితము లో ఎంతో వుపయోగపడ్డవి. వాళ్ళను అనుసరించడము. వలన సమాజములో ఈ స్థాయికి ఎదిగాను. వారి మీదవున్న గౌరవముతో నా డైనింగ్ టేబుల్ దగ్గర మా అమ్మ ఫోటో వుంచాను. ప్రతిరోజు భోజనము చేసే సమయములో మా తల్లి ఫోటో చూసి ఆమెను నా మనసులో తలచుకుంటాను. ఆమె నాకు జన్మనివ్వడమే కాదు ఆమె నుంచి ఎన్నో ఆదర్శాలు నేర్చుకుని ఒక సంఘజీవిగా అభివృద్ధి చెందాను. మా గురువుగారి పై వున్న అభిమానము, గౌరవము కొద్ది మా గురువుగారి ఫోటో నా బెడ్ రూమ్లో ఎంతో గొప్ప వ్యక్తుల ఫోటోలతో సమానముగా వుంచాను. ప్రతిరోజు ఉదయము లేగవగానే ఆ గొప్ప వ్యక్తుల ఫోటోలు మా గురువుగారి ఫోటో చూచి వారిని తలచుకుంటాను. మా తల్లి తండ్రి. మా గురువుగారిపై నాకెంతో అభిమానము, గౌరవము వుంది. నా చర్మము వొలిచి, మా తల్లికి, మా తండ్రికి, మా గురువుగారికి చెప్పులు కుట్టించినా వారి ఋణము తీరదు.

# మా బావగారు

– డా. వై.యస్. కృష్ణ మూర్తి
బాపట్ల

ముందుగా మా బావగారి అమృతోత్సవ సారధ్య సంఘ సభ్యుల ఆహ్వానమునకు నా కృతజ్ఞతాభి వందనములు. నా స్వగ్రామము కలవపాములు. డాక్టరు జయప్రదాంబ గారు మా పెదనాన్న గారి కుమార్తె కావటముతో మేమిరువురము ఒకేచోట పెరుగుట వలన ఇరువురకు ఆత్మీయత ఎక్కువ.

నేను 1947లో విశాఖపట్టణంలో వైద్య విద్యార్థిగా చేరాను. డాక్టరుగారు నాకు 5 సం॥ లు సీనియరు. మొట్టమొదట స్వర్గీయ డాక్టరు కుర్రా వీరరాఘవయ్య నాకు డాక్టరు గారిని పరిచయము చేశారు. ఆ పరిచయమే పెరిగి లాడ్జిమేటుగా గురుతుల్యుడుగా ఆత్మీయుడుగా వృద్ధిచెంది వారి వివాహమునకు సంధానకర్తనై బావగారిగా చేసుకున్నాను. వారిని గురించి పూర్తిగా తెలిసిన వాళ్లము ప్రస్తుతము నేను, చీరాలలో డా. ప్రతాప్కుమార్, చెరుకుపల్లిలో డా. పాపారావు వగైరా మాత్రమున్నాము. వారు స్వీయ చరిత్రలో వ్రాసినట్లుగా విశాఖపట్టణములో M.S. చేసే రోజులలో కొద్ది రోజులు Physiology Tutor గా R.M.O గా Asst. Surgeon గా చేసినారు. Asst. Surgeon గా చేస్తున్న సమయము నేను వారి విద్యార్థిని. వారికి ఉద్యోగము లేనప్పుడు. మా అక్క Asst. Surgeon గా చేస్తూ నిండు గర్భవతిగా ఇంటి పనులు గూడ నిర్వహించుటలో ప్రసవించవలసిన సమయముకన్నా ముందే ప్రసవించి పుట్టిన పుత్రుణ్ణి పోగొట్టుకొని చాల వ్యధకు లోనైంది. ఓదార్చుట మా తరము కాలేదు. కొద్ది రోజుల తరువాత డాక్టరు గారు M.S. పరీక్ష బంగారు పతకముతో కృతార్థులైనారు.

పరిస్థితులు మా అక్కకు కొంత ఉపశాంతి కలిగించి నవి. ఆ తరువాత కొద్ది రోజులకే గుంటూరులో ప్రాక్టీసు పెట్టి ఆసుపత్రికి ప్రజావైద్యశాల అని నామకరణము చేశారు. ప్రజావైద్యశాల అక్షరాల ప్రజావైద్యశాల అనిపించుకున్నది. నేను గుంటూరు ఆసుపత్రిలో సీనియర్ హౌస్ సర్జనుగా చేశాను. రోజు విజయవాడ నుండి వచ్చేవాడిని. ఆలస్యమైనపుడు వారింట్లోనే ఉండేవాడిని. బాపట్లలో ప్రాక్టీస్ పెట్టితే ఎలా వుంటుందని నేనడిగినపుడు "డా. రంగయ్యగారు పెదనందిపాడు వెళ్లాలంటున్నారు. కనుక అక్కడ బాగుంటుందని సలహా ఇచ్చి", కావలసిన ఏర్పాట్లకు తోడ్పడి బాపట్లలో చాలమందికి పరిచయము చేశారు. 1955 ఏప్రిల్ 25వ తేదీ వారితోనే నా నర్సింగ్హామ్ ప్రారంభింపచేశాను. నాకు తెలిసినంత వరకు వారికి అదే ప్రధమ ప్రారంభము అంటే ఆసుపత్రిని ప్రారంభించుట. ఆ తరువాత సర్జరీ కేసులన్నింటికి శ్రమ అనుకోకుండా వచ్చి నేను స్వయముగా చేయగలిగే వరకు తెనాలి నుండి డా. వీరరాఘవయ్యగారు రావడానికి తోడ్పడ్డారు. తెనాలిలో రాఘవయ్య, వీరయ్య డాక్టర్లకు వారే శిక్షణ ఇచ్చారు. ఇలా మాకే గాదు మరెంతమందినో – గురువుగారు తీర్చిదిద్దారు. నేను డా. ప్రతాప్ గారు ఒకరి కొకరు సహాయము చేసికొనే వారము. చిలకలూరిపేటలో కాజ కృష్ణమూర్తి గారు చెరుకుపల్లిలో పాపారావుగారు వగైరాలు వీరి శిక్షణ పొందినవారే. మొదట్లో ఆయనకు కారులేదు. స్నేహితుడు అట్లూరి వెంకటేశ్వరరావుగారి కార్లో వచ్చేవారు. మాకెప్పుడైనా సర్జికల్ కాంప్లికేషన్ వస్తే ఆయన వద్దకు తీసికొని వెళ్ళేవారము.

ఒకసారి మా తాతగారి పెద్ద కర్మకు కలవపాముల వెళ్లవలసి వచ్చి ఆయన స్నేహితుని కారులో బయలుదేరాము. దానికి Start చేయుటకు తాళము చెవి. లేనందున రెండు వైర్లు కలిపితే బయలుదేరుతుందని నేను వారితోనే కారు తోయించాను. వైర్ల విషయము కూడ తెలిసికోలేదని నన్నేమి అనలేదు. ఈ విషయములో వారు ఎదుటి వారి అశ్రద్ధను అవకాశంగా తీసికొని హేళన చేయని ఓర్పు ఎంతో తెలుసుకున్నాను. వారి జీవిత చరిత్రలో వ్రాసినట్లు 1962 డిసెంబరులో ఔరంగాబాద్, అజంతా, ఎల్లోరా, బొంబాయి, పూనా పట్టణములన్నీ కారులో వెళ్లి వచ్చాము. నాటి ఆ ప్రయాణపు ఆనందము మరువలేనిది. 1966 డిసెంబరులో సదాశివరావుగారు, డా. యతిరాజులుగారు, డా. నూతక్కి గారు, డా. నాదెళ్ల కృష్ణారావు గారు, డా. ప్రతాప కుమార్ గారు మేము అందరు కుటుంబముగా 5 కార్లలో తిరుపతి, కుప్పం, బెంగుళూరు, మణిపాల్, తిరువనంతపురము, కన్యా కుమారి, శుచీంద్రము, మధుర, రామేశ్వరం, పుదుచ్చేరి అన్నీ తిరిగి వచ్చిన విషయము వ్రాస్తుంటే ఆ అనుభూతి కళ్లముందు కదులుతున్నట్లు ఆనందంగా

ఉంది. ఆ 15 రోజులు నా ఆసుపత్రి చూచుటకు డా. పరంధామయ్యగారు, కీ.శే. డా. మహదేవ రావుగారిని ఏర్పాటు చేసినారు. వారు అనారోగ్యముగా నున్నప్పుడు నాదగ్గర 10 రోజులున్నారు. అప్పుడు మా పిల్లలతో ఎంతో సరదాగా గడిపారు. నేను 1986 నుండి ఎక్కువగ పిల్లల వద్ద U.S.A. (అమెరికా) లో ఉండే వాడిని. 1997లో డాక్టరు గారు U.S.A. వచ్చి మా అమ్మాయి డా. మాలతి, అల్లుడు డా. నందనకుమార్ గార్ల ఇంట్లో నాలుగు వారాలున్నారు. అప్పుడు వారికి అస్వస్తతగా ఉంటే, తగు విశ్రాంతి తీసుకున్నాక ఇద్దరము కలిసి తిరిగాము.

అట్లాంటాలో వారి శిష్యులతో చెప్పి వారి 75వ జన్మ దినోత్సవము వారికి చివరివరకు తెలియకుండ ఆశ్చర్యచకితులను చేశాం. అప్పుడే వారి శిష్యులు Dr. A.S.Rao, prof of surgery Wykoff Hospital, Newyork. డా. సుబ్బారెడ్డి Prof. of Urology వాళ్ల హాస్పిటల్లోని Aniversary కి ఆహ్వానించి తీసికొని వెళ్లారు. వారిద్దరు మా బావగారిని మా ప్రొఫెసర్ అని పరిచయము చేయగానే అక్కడి వారు Prof. of Profs. అని ఎంతో గౌరవ మర్యాదలతో ఆదరించారు. వారి ఆతిధ్యము దేశము కాని దేశములో అంత గౌరవాతి Vysya Banka  to bank ధ్యమందుకోటమంటే మాటలా. అది వారి సంస్కారము నకు మచ్చుతునక, మా అనుబంధము, ఆప్యాయతలకు మరో అనుభవము. మా పెద్దబ్బాయి డా. ఈశ్వర ప్రసాద్కు నేను నా భార్య 2004 U.S.A. లో ఉండగా చాలా సుస్తీ చేసి నెఫ్రాలజీ Unit లో చేర్చారు. మా అమ్మాయికి ఈ విషయం తెలిసి తగిన రీతిగ అక్కడి వైద్యుల సహాయం తీసుకుని గుంటూరు డాక్టర్లతో మాట్లాడుచున్నను మాకు తెలియనివ్వలేదు. ఈశ్వర ప్రసాదు బాగాలేదని మేము హడావిడిగా ఇండియాకు రావద్దని మా బావగారు Phone చేసి మీరు త్వరపడి రానవసరములేదని తనే వాడి విషయము చూసు కుంటానని చెప్పి బాబును ఆసుపత్రి నుండి తన ఇంటికి తీసికొని వెళ్లి అబ్బాయి పూర్తిగా కోలుకొనే వరకు చాల జాగ్రత్తగా చూశారు. మేము వచ్చేసరికి మా అబ్బాయి పూర్తిగా recover అయినాడు. మేము బాపట్ల వచ్చిన.. ప్రారంభములోనే విజయవాడ లయోల కాలేజీ స్థాపించుట జరిగినది. ఆ కాలేజికి ఫండ్స్ పోగు చేయుటకు కీ.శే. ఫాదర్బాలయ్య గారి బృందము మా ఇంటికివస్తే, వారితోపాటు నేను వెళ్లి నా చేతనైనంత వసూలు చేసి ఇచ్చాను. అలా తిరుగుతున్న సమయంలో "మనము కూడా అలా ఎందుకు చేయకూడదని" Bapatla Education Society ని ఏర్పాటు చేయుట మిత్రులు నన్ను ప్రెసిడెంట్ గా ఎంపిక చేయుట జరిగింది. ఏ ముఖ్యదాత లేకుండ ప్రజల నుంచి చందాలు వసూలు చేసి 1963 Bapatla Arts and Science College స్థాపించాము. మా బావగారు కూడా చాలమంది Lecturers ను రికమండ్ చేసి పంపించారు. వారు స్వీయచరిత్రలో వ్రాసినట్లుగా ముందే బాపట్లలో స్థాపించిన కళాశాల నుండి నియమావళిని తెప్పించి దానిలో మార్పులు చేర్పులతో వారి నియమావళిని ఏర్పరచుకున్నారు. ఈ రకంగా వైద్యమే కాకుండా సమాజానికి అవసరమైన విద్య, సాంస్కృతిక ప్రజా సేవలతో బహుముఖ ప్రజ్ఞాశాలిగా మనన్నలందిన మహామనిషికి సమర్పించుతున్న మల్లె పూదండలో నా ఈ చిన్ని సరాన్ని జతపరచవలసినదిగా కోరుతున్నాను.

# మైత్రిని మంచి గంధంగా భావించే మన డాక్టరుగారు

–డా కడియాల వాసుదేవరావు

గుంటూరు నగరం యొక్క కాదు గుంటూరు జిల్లా యొక్క కీర్తి పతాకను ఎంతో ఎత్తుకి తీసుకొని వెళ్ళి సముజ్వలంగా దానిని రెపరెప లాడించిన కొద్దిమంది. వ్యక్తులలో డాక్టరు కాసరనేని సదాశివరావు గారొకరు. సదాశయాలకు పెద్దపీట వేసే డాక్టరు గారి సమగ్ర వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించాలంటే ఒక సిద్ధాంత వ్యాసమే రాయాలి. బహుముఖ ప్రజ్ఞాశాలి మన డాక్టరు గారు. జీవితపు విలువల గురించి, సామాజిక వికాసం గురించి, నాగరికత తీరు తెన్నుల గురించి, మానవతా దృక్పథం గురించి, సాహితీ పరిమళం గురించి, మనుషుల మధ్య నెలకొనే మమతల వంతెన గురించి డాక్టరు సదాశివరావు గారికి తెలిసినంతగా మరొకరికి తెలియదని వారి అభిమానులమైన మనందరం అనుకునే మాట.

ప్రపంచంలోనే వైద్య శిఖామణిగా ఆరాధించబడే సర్ విలియం ఆస్లర్, ఆయన వ్రాసిన చిరు వ్యాసంలో వైద్య వృత్తికి అత్యంత కీలకమయిన పదం ఏమిటో వివరిస్తూ, ఆ పదం పేరు అందరికి తెలిసినదేనని అన్ని రహస్యాలూ అందులోనే ఇమిడి ఉన్నాయని చెబుతూ చివరికి, ఆ పదం (Work) (శ్రమ) అని తేల్చిచెప్పాడు. ఆ లఘు వ్యాసం ఆంగ్ల సాహిత్యంలో ఒక మణిపూస, విద్యార్థిగాను, వైద్యునిగాను డాక్టరు సదాశివరావు గారు పరిశ్రమకు ఎంతో విలువ నిచ్చేవారు. పరిశ్రమ ప్రతిభకు వన్నె తెస్తుంది. ఆ బాటలో పయనించిన డాక్టరు గారు. విద్యార్థి దశలో అనేక బహుమతులు, ఎమ్.ఎస్. (జనరల్ సర్జరీ) పరీక్షలో స్వర్ణపతకం పొందారు. వారి గురువులను ఎప్పుడూ కృతజ్ఞతా భావంతో స్మరించుకోవడం వారి కలవాటు.

1951వ సం॥లో గుంటూరులో వారు, డా॥ జయవం దాంబగారు ప్రజా వైద్యశాలను స్థాపించడం పట్టం చరిత్రలో ఒక మైలు రాయి. "పేరులోన గలదు పెన్నిది అన్న చందంగా ఆ సంస్థ ప్రజలందరికి ఎనలేని వైద్య సహాయాన్నందించింది. శస్త్రచికిత్సలను ప్రామాణిక పద్ధతిలో నిర్వహించడం వలన ఆధునిక వైద్యం అందరికీ అందుబాటులోకి వచ్చింది. ఆదర్శ మూర్తులయిన వైద్య, దంపతులు మరువలేని సేవలందించారు. అందరి కృతజ్ఞతలకు పాత్రులైనారు. వైద్య శాస్త్రంలో గణనీయమ యిన జ్ఞానంతో పాటు, నైతిక సూత్రాలను నూటికి నూరు పాళ్ళు పాటించిన వ్యక్తి డా॥ సదాశివరావుగారు, సహృదయతకు వారు పర్యాయపదం. వారి వద్దకు వైద్య సహాయం కోరి, ఏ విద్యార్థి వెళ్లినా ఫీజు తీసుకునే వారు కాదు. ఉపాధ్యాయులను ఎంతగానో గౌరవించే వారు, ఉచిత వైద్యమే కాకుండా వారి వద్ద ఉన్న మందుల శాంపిల్స్ కూడా ఇచ్చేవారు. అంతటి ఉదారత వారిది. ఏదేని కారణం వలన వారి వైద్యశాలలో వైద్యం పొందు తున్న రోగి మరణిస్తే, ఆ కుటుంబ సభ్యుల నుండి ఒక్క రూపాయి కూడా తీసుకునేవారు కాదు. డాక్టరు గారి నైతిక సూత్రావళికి ఎన్నో ఉదాహరణలు పేర్కొనవచ్చు.

ఊపిరి సలపని వైద్య వృత్తిని నిర్వహిస్తూనే, వారు బోధనా రంగం పట్ల ఆసక్తితో, 1963లో గుంటూరు వైద్య కళాశాలలో ఆనరరీ ప్రొఫెసర్ ఆఫ్ సర్జరీగా బాధ్యతలను స్వీకరించారు. వారికి విద్యార్థిని కావడం నా అదృష్టంగా భావిస్తాను. వారి నుండి నేను ఎన్నో విషయాలు నేర్చుకున్నాను. క్లిష్టమయిన విషయాలను వర్గీకరించి వాటిని తేట తెల్లంగా వివరించడంలో మంచి నైపుణ్యం ఉండేది వారికి. సునిశిత హాస్యం డాక్టరు గారి స్థిరాస్థి వారి వాక్కులు ఎందరికో ప్రేరణ కలిగించేవి. వారి చేతుల మీదుగా కొన్ని వందల నర్సింగ్ హోమ్లకు ప్రారంభోత్సవాలు జరిగాయి.

మైత్రిని మంచి గంధం గాను, జీవితాన్ని మంచి గ్రంథంగాను భావించేవారు డా॥ సదాశివరావు గారు, డా॥ జయప్రదాంబ గారు వారి నివాసంలో ఎప్పుడూ. సందడే సందడి. ఉత్సవ వాతావరణం కనిపించేది. చిరు నవ్వులు, చలోక్తులు ప్రతిధ్వనించేవి. మమతలతో వేసిన మల్లెపందిరి లాగా ఉండేది వారి గృహం. అతిధులందరికీ సహనంతో వండి ఎంతో మర్యాద చేసేవారు తులశమ్మ గారు.

జయప్రదాంబ గారి స్వగ్రామం కలువపాముల, మా గ్రామానికి మైలున్నర దూరంలో ఉన్నది. వారి కుటుంబ తో ఉన్న పరిచయం వలన నాకు కొంత సన్నిహితత్వం లభించింది. డాక్టరు గారి పిల్లలు రమాబాల, ఉమాబాల, ఉషాబాల, రమేష్, సురేష్

లు వైద్య విద్యార్థులు కావడంతో నేను వారి కుటుంబ సభ్యుడిగానే పరిగణింపబడు తున్నాను. ఇది నా అదృష్టం. డాక్టరు గారు మంచి పుస్తక ప్రియుడు. తెలుగు సాహిత్యంలో 'మణిదీపాలు' వంటి గ్రంథాలు వారి దగ్గర కోకొల్లలుగా ఉన్నాయి.

'సాహితీ సదస్సు' డాక్టరు గారు గుంటూరు లోని సాహితీ ప్రియుల కందించిన అపురూప కానుక. 1966లో దసరా రోజున జన్మించిన ఆ సదస్సు ఎంతో పేరు తెచ్చుకొన్నది. 1980 వరకు నిర్వహించిన కార్యక్రమాలలో మంచి జిజ్ఞాస పూర్వకమైన చర్చలు, ఆసక్తికరమైన గోష్ఠులు, ఉపయుక్తమయిన ఉపన్యాసాలు జరిగాయి. అందరినీ అలరించాయి. దాచుకున్న మొగలి రేకులు వలె ఆనాటి పరిమళాలు నేటికీ సజీవంగానే ఉన్నాయి. 1971లో 'నవయుగ కవి చక్రవర్తి' గుర్రం జాషువా గారి పై ఒక వ్యాసం వ్రాసి ఉత్తమ కవితకు సమకాలీనత, విశ్వజనీనత అనేవి రెండు కొలబద్దలని చక్కటి భావం వెలిబుచ్చారు డా॥ సదాశివరావు గారు, విద్యారంగానికి గొప్ప సేవలందించారు డాక్టరు గారు. 1968లో స్థాపించబడిన జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాల విశిష్టమైన సంస్థగా రూపుదిద్దుకున్నది. –నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ వారి ఆధ్వర్యములో నెలకొన్న విద్యాసంస్థలన్నీ సమాజ ప్రగతికి ఇతోధికంగా దోహదం చేస్తున్నాయి. 1996లో స్థాపితమయిన డాక్టరు జయప్రదాంబ డిగ్రీ కళాశాల స్వల్ప కాలంలోనే అందరి మన్ననలందుకున్నది. విద్యావంతులు రాజకీయాలలోకి అడుగు పెట్టాలని, అప్పుడే దేశం బాగుపడుతుందని పలుమార్లు అనేవారు సదాశివరావుగారు. విజ్ఞానం, చైతన్యం పుష్కలంగా ఉన్నవారు ప్రజా సమస్యలను బాగా అవగాహన చేసుకోగలరనీ, దాని వల్ల సమాజం లబ్ది పొందుతుందని డాక్టరు గారి అభిప్రాయం. ఈ భావన కనుగుణంగానే వారు లోక్ సభకు, శాసన సభకు పోటీ చేసారు. 1985లో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర శాసన సభకు ఎన్నుకోబడ్డారు. అనేక విషయాలలో నాటి ముఖ్యమంత్రి డా॥ఎన్.టి.రామారావు గారికి సలహాలిచ్చారు. డా॥ ఎన్.టి.ఆర్. సదాశివరావు గారి మాటకు ఎంతో విలువ నిచ్చేవారు. ఆచార్య రంగా గారి జీవితం, వారి సిద్ధాంతా లు డాక్టరు గారి ఆలోచనలను బాగా ప్రభావితం చేశాయి.

ఫిబ్రవరి 2008లో డాక్టరు గారి స్వీయ చరిత్ర 'సదాశివమ్' అనే గ్రంథానికి ఆవిష్కరణ మహోత్సవం జరిగింది. నేత్ర పర్వంగా జరిగిన ఆ సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన జస్టిస్ చలమేశ్వర్ గారు మంచి ప్రసంగం కావించారు. "సంఘంలో ఆదర్శమూర్తులు తగ్గిపోతున్నారు. కొన్నాళ్ళు పోయాక పూర్తిగా కరువై పోవచ్చు. ఒక ఆదర్శమూర్తి జీవిత ప్రస్థానం గ్రంథ రూపంలో వెలువడుతున్న శుభ తరుణాన, సభకు తప్పక హాజరవ్వాలని, అస్సాం నుండి ఆంధ్రప్రదేశ్కు దీర్ఘ ప్రయాణం చేసి వచ్చాను," అన్నారు ఆయన. సభానంత రం ఇంటికి వెళ్ళాక నేను ఆదర్శమూర్తులు తగ్గిపోవ దానికి కారణమేమిటా అని కాసేపు తర్కించుకున్నాను. నాలో. జస్టిస్ చలమేశ్వర్ గారి మాటలు ఎందరినో ఆలోచింపచేశాయి. నేను వెతుకుతున్న కారణాలు నా కళ్ళ ముందు కనబడానికి ఎంతోసేపు పట్టలేదు. వాటిని అక్షర క్రమములో ఏర్పాటు చేసుకోవడానికి కూడా అట్టే సమయం పట్టలేదు.

**నాకు గోచరించిన కారణాలు :**

అ) అధికార కాంక్ష
ఆ) ఆర్జన పట్ల ఆరాటం
ఇ) ఇహలోక సుఖాలకోసం వెంపర్లాట
ఈ) ఈర్ష్యా ద్వేషాలు
ఉ) ఉదారత లోపించడం
ఊ) ఊసరవెల్లి స్వభావం

వీటి వివరణలోకి వెళ్ళడం విషయాంతరం గనుక ఆ ప్రయత్నం చేయను. డా॥ సదాశివరావు గారు ఆంధ్ర జాతి గర్వించదగ్గ ఆదర్శమూర్తి.

సద్విద్య, సద్వైద్యం, సమాజానికి ముఖ్యమని పలు మార్లు నొక్కి చెప్పారు డాక్టరు గారు, ఆ దిశగా తమ సేవలను విరివిగా అందించి తరువాతి తరాలకు గొప్ప ప్రేరణను, స్ఫూర్తిని అందించారు. వారికి మంచి ఆరోగ్యాన్ని, దీర్ఘాయువును ప్రసాదించమని సర్వేశ్వరుడిని ప్రార్థిస్తున్నాను.

ఇద్దరు మహా వ్యక్తుల మధ్య పోలికలు ఎలా ఉంటాయో గమనించడం ఆసక్తితో కూడిన ప్రక్రియ.

డా॥ కట్టమంచి రామలింగారెడ్డి గారికి, డా॥ కాసరను శ్రీ శ్రీ సదాశివరావు గారికి మధ్య కొంత సారూప్యం ఉన్నది... ఇరువురికీ విద్యారంగం పట్ల విపరీతమయిన అభిమానం, సాహితీ రంగం పట్ల మక్కువ ఎక్కువ. ఇద్దరికీ రాజకీయ రంగం పట్ల ఆసక్తి మెండు. అయితే వారి మధ్య కొన్ని తారతమ్యాలు లేకపోలేదు. ఒక విషయంలో వారి సారూప్యం కించిత్తు ఆశ్చర్యం కలిగిస్తుంది. అదేమిటంటే. కట్టమంచి వారి గోత్రం 'సదాశివ'!

గురువుగారు డా సదాశివరావు గారితో ఎప్పుడూ సంభాషించినా, తత్వవేత్త Bertrand Russell వాక్యాలు నా మదిలో మెదులుతాయి. ఆయన రచించిన "The Conquest of Happiness" అనే గ్రంథంలోని చిట్టచివరి పంక్తులను ఉదహరిస్తూ ఈ వ్యాసం ముగిస్తాను.

...such a man feels himself a citi- zen of the universe, enjoying freely the spec- tacle that it offers and the joys that it affords. untroubled by the thought of death because he feels himself not really separate from those who will come afer him. It is in such profound instinctive union with the stream of life that the greatest joy is to be found."

ఒరు లేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనమునకునగు తా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథముల కెల్లన్. – ***భారతము***

ఉన్నట్లు యుండ నద్దరి
కిన్నరులను నావజేర్చు క్రియ వెన డా బో
కున్నట్లయుండి కాలం
బున్నరులకు వయసు బుచ్చి మోసము దెచ్చున్. – ***ఆముక్తమాల్యద***

# విలక్షణమైన వ్యక్తిత్వం

–శ్రీ వడ్డే శోభనాద్రీశ్వరరావు
మాజీ వ్యవసాయ శాఖాదత్కులు

డాక్టర్ కాసరనేని సదాశివరావు గారు విలక్షణమైన వ్యక్తిత్వంతో గుంటూరు సీమ ప్రజల హృదయాలలో తనకంటూ ప్రత్యేక స్థానాన్ని పొందారు. వైద్యవృత్తిని కేవలం ఆదాయాన్ని సమకూర్చే సాధనంగా భావించకు ప్రజలకు ముఖ్యంగా తాను పుట్టి పెరిగిన ప్రాంత వాసులకు వైద్య సేవలనందించాలనే ఆశయంతో ప్రజా వైద్యశాలను ఏర్పాటుచేసి, నిజం చెప్పే డాక్టరుగా, రోగులను పీడించక, వారి స్తోమతును బట్టి యిచ్చిన దానితో తృప్తిచెంది, తక్కువ వ్యయంతో నాణ్యతతో కూడిన వైద్యాన్ని, సర్జరీని అందించే ప్రజా వైద్యశాలలకు ఆద్యుడైనారు డాక్టరు సదాశివరావుగారు. గుంటూరు. ప్రకాశం జిల్లాలలో అనేక గ్రామాల్లో డాక్టరు గారి అభిమానులు వున్నారు.

వైద్య శాస్త్రాన్ని అభ్యసించుతూనే సమకాలీన, రాజకీయ పరిస్థితులను గమనించుతూ, మహాత్మా గాంధీని దగ్గరగా సందర్శించు భాగ్యమును పొందారు. ఆచార్య రంగా గారు డాక్టరు గారిపై గాఢమైన ప్రభావాన్ని కల్గించారు. కిసాన్–మజ్ ూర్ ప్రజారాజ్యం ఆశయం డాక్టరుగారిని ఆకర్షించబట్టే స్వతంత్ర పార్టీ, బి.యల్.డి. జనతా పార్టీ, లోక్ దళ్ లో ప్రముఖ పాత్రను వహించారు.

రంగాజీ కాంగ్రెసులోనికి వెళ్ళినా రైతు శ్రేయస్సు, గ్రామీణ అభ్యున్నతికి చౌదరీ చరణ్ సింగ్ నాయకత్వంలో సర్దార్ గౌతు లచ్చన్న సారధ్యలో లోక్ దళ్ పార్టీలో రాష్ట్ర ఉపాధ్యక్షునిగా వ్యవహరించారు. చిలకలూరిపేటలో కిసాన్ సమ్మేళన్ మహాసభలను అత్యంత జయప్రదంగా నిర్వహించడానికి కృషి సల్పారు. అప్పట్లో నేను ఆంధ్రప్రదేశ్ కిసాన్ సమ్మేళన్ అధ్యక్షునిగా వున్నాను. చౌదరి సాబ్ వ్రాసిన "Economic Night of India" పుస్తకంలో చాలా చక్కగా, వివరంగా, సోదాహరణంగా భారతదేశం అన్ని వనరులను కలిగి వుండి కూడా ఎందువలన వెనుకబడి వుంది, ముందుగా వ్యవసాయాభి వృద్ధి చెంది గ్రామీణ ప్రజల కొనుగోలు శక్తి పెరిగినప్పుడు పారిశ్రామికాభివృద్ధి సేవా రంగాలు కూడా అభివృద్ధి చెంది భారతదేశం సుసంపన్నం కాగలదని చరస్సింగ్ విశ్లేషించారు. చరణ్ సింగ్ పట్ల డాక్టరుగారిలో కాని, నాలోని గాఢంగా నాటుకుపోయిన అభిమానమే 1983లో నందమూరి తారకరామారావుగారు. ప్రారంభించిన తెలుగుదేశం ప్రభంజనం ఉధృతంగా వుండి పలువురు హితులు, అభిమానులు, అనుచరులు తెలుగుదేశంలో చేరమని ఒత్తిళ్ళు తెచ్చినా, మేము లోక్నో కొనసాగేట్లు చేసింది. పెదకూరపాడు శాసన సభ్యునిగా ఆ ప్రాంత అభివృద్ధికి గణనీయమైన సేవ లందించారు డాక్టరు గారు, పదవుల కొరకు డాక్టరు గారు ఏనాడూ ప్రాకులాడలేదు.

విద్యారంగానికి ఎనలేని సేవలనందించారు డాక్టరు గారు, మాననీయులు జాగర్లమూడి చంద్రమౌళిగారు చేబ్రోలు హనుమయ్యగారు, గోగినేని కనకయ్య మున్నగు పలువురు వదాన్యులతో కలసి స్థాపించిన జె.కె.సి. కళాశాల దినదిన ప్రవర్ధమానమై పోస్టు గ్రాడ్యుయేషన్తో సహా అనేక కోర్సులను అందిస్తూంది. డా॥ మద్దిన గోపాలకృష్ణ గారు సమకూర్చిన స్థలంలో డాక్టరు గారి కుటుంబ సభ్యుల భూరి విరాళంతో ప్రారంభించబడిన డా॥ జయప్రదాంబ మహిళా కళాశాల నేడు వేలాది మంది విద్యార్థినులకు చక్కని ఉన్నత విద్యను లభింప జేయటం అభినందనీయం.

ముందునుండి సాహిత్యాభిలాష, కవులలో సన్నిహిత మిత్రత్వం, సాహిత్య గోష్ఠులు, కవులకు సన్మానం జరపటం డాక్టరుగారికి ఆనందం. అందుకు ఆయన అర్ధాంగి జయప్రదాంబగారు కవిగారి కుమార్తె కావడం కొంతవరకు కారణం కావచ్చు. ఒక ఇంగ్లీషు వార పత్రికలో నెపోలియన్ చివరి రోజులకు సంబంధించిన వ్యాసం చదివి తనకున్న ఉబ్బసం అనారోగ్యం పట్ల లెక్టి చేయక ధైర్యంగా తన వ్యాపకాన్ని కొనసాగించిన మనో నిబ్బరం కల వ్యక్తి. ఆచార్య రంగా చౌదరీచరణ్ సింగ్, లోక్ నాయక్ జయప్రకాష్ నారాయణ్ ఆశయాలకు అనుగుణంగా సర్దార్ గౌతు లచ్చన్న, తెలుగు తేజం యన్.టి. రామారావు గార్ల నేతృ త్వంలో సుదీర్ఘ రాజకీయ ప్రస్థానంలో మచ్చలేని వ్యక్తిగా నిజాయితీ నిబద్ధతలతో వైద్యోనారాయణ సూక్తిని పాటించిన డాక్టర్

కాసరనేని సదాశివరావు గారు పూర్ణ పురుషుడు, ధన్యజీవి. నేటి యువతరం ముఖ్యంగా వైద్యవృత్తిలో వున్న వారికి ఆయన స్ఫూర్తి కావాలి. నిండు నూరేళ్ళు ఆరోగ్యంగా, ఆనందం తో సమాజ సేవలో ఎంతో కొంత పాత్ర నిర్వహించేలా భగవంతుడు ఆయనకు ఆయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను.

## మా గ్రామం చేసుకున్న అదృష్టం

– శ్రీ గోగినేని అమరేంద్ర
సర్పంచ్, రామచంద్రపాలెం (గారపాడు).

సర్పంచ్ ఎక్కడికైనా వెళితే, మీది ఏ గ్రామం అని నన్నడిగినపుడు, మాది రామచంద్రపాలెం (గారపాడు) అని చెప్పగా, ఎక్కడా ఆ గ్రామం అని అడిగిన వాళ్ళకి Dr. Sadasiva Rao గారి ఊరు అని చెప్పేవాడిని. అప్పటికే ఆయన పేరు రాష్ట్రం మొత్తం సుపరిచితం. అలాంటి మంచిమనిషి, మహోన్నతమైన వ్యక్తిని ఆదర్శంగా తీసుకొని, గ్రామాభివృద్ధికి పాటుపడుతున్నాను. అలా ఒక వ్యక్తి పేరుతో గ్రామాన్ని గుర్తించడం నిజంగా మా గ్రామం చేసుకున్న అదృష్టం.

రాష్ట్రం మొత్తంలో ఏ ఒక్క వ్యక్తి వేలు పెట్టి చూపించలేని మహోన్నతమైన వ్యక్తిత్వము గల Dr. Sadasiva Rao గారు మా గ్రామంలో జన్మించటం మా గ్రామం చేసుకున్న పుణ్యమని భావిస్తూ, మా గ్రామ ప్రజలందరి తరపున వారికి 86వ జన్మదినోత్సవం సందర్భంగా శుభాకాంక్షలు తెలియజేయుచున్నాను.

# 'హీలింగ్ రేస్' 'ఎయిలింగ్ మిలియన్స్'

– డా పి. రామమోహనరావు
సంజీవి నర్సింగ్ హోం, నిజామాబాద్

## ఉపోద్ఘాతం

తెలిసినవాళ్ళు ఎవరు కనిపించినా, 'బాగున్నారా'? అని అడుగుతాం. ఎదురుగా మనిషి ఆరోగ్యంగా కనిపిస్తున్నా ఆ ప్రశ్న అడుగుతూనే వుంటాం. ఆ ప్రశ్న లోనే ఆరోగ్యానికున్న ప్రాముఖ్యత తెలిసిపోతుంది. అందుకే 'ఆరోగ్యమే మహాభాగ్యం' అనే సామెత ప్రాచుర్యం చెందింది. 'ఆరోగ్యం అంటే మనిషి శారీర కంగా, మానసికంగా మరియు సాంఘికంగా బాగుం డటం అంతేగాని కేవలం వ్యాధి లేకపోవడం మాత్రమే కాదు'. ఈ నిర్వచనం ప్రపంచ ఆరోగ్యసంస్థ చెప్పినదే మరి, దశాబ్దాలు గడిచిపోతున్నా ఆరోగ్యరంగం, వైద్య విజ్ఞానం కొత్త టెక్నాలజీతో అభివృద్ధి చెందుతున్నా, వైద్య సదుపాయాలు సామాన్య ప్రజానీకానికి ఇంకా దూరం గానే వున్నాయన్నది కళ్ళముందున్న నిజం. వైద్యశాస్త్రం ఎంతో అభివృద్ధి చెందుతూ కొత్త మనిషినే సృష్టించే ప్రయత్నంలో వుంటే, మన దేశంలోని ఎనభై శాతం ప్రజలు ఆహారలేమి, అంటువ్యాధులు, దోమలు, నల్లులు, పిచ్చికుక్కలతో పోరాడుతున్నారు. భారత రాజ్యాంగం ప్రజల ఆరోగ్య సంరక్షణ 'రాజ్యం' యొక్క ప్రాధమిక విధి అంటే, ఐక్యరాజ్యసమితి 2000 సం॥ నాటికే అందరికీ ఆరోగ్యం అన్నది. ఐక్యరాజ్య సమితి నినాదం సిల్వర్ జూబ్లీనీ, భారత రాజ్యాంగం గోల్డెన్ జూబ్లీని పూర్తి చేసు కున్నాయి. అదే సమయంలో ప్రజారోగ్యం, వ్యాపార సరుకై, ఆరోగ్యం అద్దాల మేడలోకి, ప్రజలు రోడ్డు మీదికి చేరడం పూర్తయింది.

అలా ఎందుకని ఆరోగ్యాన్ని కాపాడటం, అనా రోగ్యం రాకుండా చూడటం, వచ్చిన అనారోగ్యానికి వైద్యం చేయడం ఈ మూడు అంశాలను సరిగా నిర్వహించగలిగినప్పుడే పౌర సమాజం ఆరోగ్యంగా ఉంటుంది. కానీ నేడు 'రోగానికి వైద్యం' అనే మూడవ అంశం మీదనే ఎక్కువ కేంద్రీకరణ జరగడం వలన వైద్యుల మీద ఒత్తిడి పెరుగుతుంది.

పైన చెప్పిన మూడు అంశాలను ఆచరణలో పెట్టి ప్రజల ఆరోగ్యాన్ని రక్షించే బాధ్యత ప్రభుత్వానిదేనని భారత రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలు చెబు తున్నాయి. అంతేకాక ప్రాథమిక హక్కులతో ఉన్న 21వ నిబంధనను వివరిస్తూ మన సుప్రీంకోర్టు 'జీవించే హక్కు' అంటే 'ఆరోగ్యంగా జీవించే హక్కు కూడా అని వివ రించింది. ఆరోగ్యంగా ఉండాలంటే లేదా అనారోగ్యాన్ని కాపాడుకోవాలంటే, రక్షిత మంచినీరు, సరియైన పౌష్టిక ఆహారం, పరిసరాల పరిశుభ్రత, మురుగు కాలువల నిర్వహణ, మరుగుదొడ్ల సౌకర్యం, పనిచేసే దగ్గర సరియైన వాతావరణం లాంటి ఎన్నో అంశాలను ప్రభుత్వమే నిర్వహించాల్సి ఉంటుంది. మరి వ్యాధిగ్రస్తు లకు చికిత్స నందించడంలో కూడా ప్రభుత్వం గణనీయ మైన పాత్ర వహించవలసి ఉంటుంది. బ్రిటన్ లాంటి పాశ్చాత్య దేశంలో వైద్యం, విద్య పూర్తి బాధ్యత ప్రభుత్వానిదే.

**కొన్ని ప్రశ్నలు**: ప్రభుత్వరంగ ఆసుపత్రులు బలహీనపడటం అనే అంశాన్ని ప్రయివేటురంగంలోని ఆసుపత్రులు తమ స్వార్ధ ప్రయోజనాలకు వాడుకుంటున్నారనే వాదం అక్కడక్కడ వినిపిస్తుంది. అయితే ప్రభుత్వ రంగ ఆసుపత్రులు బలపడకపోవడానికి కారణాలు ప్రయివేటు ఆసుపత్రులా? అలా అనుకోవడం హాస్యా స్పదం కాదా? నిజంగా దానికి కారణం ప్రభుత్వ ఆసుపత్రులలో బిల్డింగులు, పరికరాలు సమకూర్చు కున్నారు. మరి దానివలన ఎంత ప్రయోజనం జరిగిందో రోజూ ప్రభుత్వ ఆసుపత్రులకు వెళ్ళే సామాన్య జనానికి తెలియాలి. ఇంకాకూడా మరికొన్ని కోట్లు ఖర్చుపెట్టి గ్రామాలలో ఆరోగ్య పరిస్థితులను మెరుగుపర్చటానికి ప్రభుత్వం ప్రణాళికను సిద్ధం చేసింది. ఎన్ని ప్రణాళికలు వేసినా ఫలితం అనుకున్నంతగా లేకపోవటానికి అమలులో చిత్తశుద్ధి లోపమా ?

అసలు ప్రయివేటు రంగానికి, ప్రభుత్వరంగానికి పోటీ ఉండవలసిన అవసరం ఉందా? కొన్ని సర్వేల ప్రకారం మొత్తం జనాభాలో 20 శాతంకి పైగా ఏ పరిస్థితులలోనూ ఆర్థిక స్తోమత లేక ప్రభుత్వరంగ ఆసుపత్రులకే వెళ్తారు. ఒక 30 శాతం మంది

అచ్చగా ప్రయివేటు ఆసుపత్రులకు వెళ్తారు. మిగిలిన 50 శాతం మంది అప్పులు చేసి అయినా ప్రయివేటు రంగానికి వేళ్తున్నారు. ఒకవేళ ప్రభుత్వరంగం బాగుంటే వీరిలో సగం ప్రభుత్వ ఆసుపత్రులకు వెళ్ళే అవకాశం లేదా ?

ఇదంతా ఒకవైపు. మరొక వైపు ప్రజలలో ఉన్న అజ్ఞానం, అమాయకత్వం వలన, అనవసరంగా పరీక్షలు చేయించుకొనడం, ఎక్సరేల కోసం అడగటం, సూది మందు కోరుకోవడం జరుగుతుంది. చదువుకున్నవారు కూడా ఎక్కువ మందులు కావాలని కోరుకోవడం కూడా చూస్తున్నాము. ఇవి పోగొట్టడం, ఎవరి బాధ్యత ?

గతంలో ప్రభుత్వ ఆస్పత్రులలో గాని, ప్రయివేటు ఆస్పత్రులలోగానీ, చికిత్స చేయటం ఒక నైతిక బాధ్యతగా ఉండేది. రోగులు వైద్యులపై గౌరవం, విశ్వాసం కలిగి ఉండేవారు. మెడికల్ కాలేజీలలో సీనియర్ ప్రొఫెసర్లు, వైద్య విద్యార్థులకు శ్రద్ధగా బోధించడమేకాక రోగుల పట్ల వైద్యులకుండవలసిన నైతిక బాధ్యతను గురించి కూడా వివరించేవారు. వైద్యం ఎక్కువ భాగం ప్రభుత్వ ఆస్పత్రులలోనే జరుగుతూ ఉండేది. కాని ఈ రోజున ఆ పరిస్థితి లేదు. వైద్య కళాశాలల సంఖ్య పెరుగుతుందే. కాని, లోపల ఉండవలసిన వాతావరణం ఉండడంలేదు. అంతేకాక మారుతున్న పరిస్థితుల కనుగుణంగా ప్రైవేటు రంగంలో వైద్యశాలల రూపురేఖలు మారిపోతున్నాయి. అంతర్జాతీయ స్థాయిలో, పెద్ద పెద్ద ఆస్పత్రులు కార్పోరేట్ రంగంలో వచ్చేశాయి. అంత పెట్టుబడి ప్రైవేటుగా పెట్టినప్పుడు లాభం అనే ఆలోచన రాక తప్పదు. ఈనాడు చేయించుకోగలిగితే (ఆర్థికంగా) మనదేశంలో చేయలేని వైద్యం లేదు ఇది ఒక గొప్ప విజయమే. ఇది నాణేనికి ఒక వైపు, మరొకవైపు దేశ జనాభాలో మూడవ వంతుగా ఉన్న బీదవారికి నూతన వైద్య చికిత్సలు అందుబాటులో లేకుండా పోతున్నాయి. ప్రభుత్వ రంగంలో వైద్యులకు హేతుబద్ధంగా జీతాలు, ఇతర సదుపాయాలు పెంచి, ఆసుపత్రులలో కనీస వసతులు ఏర్పరచి, కావలసిన మందులు ఇతర పరికరాలను సమకూర్చి, కొన్ని ఖచ్చితమైన నిబంధనలు విధించి వాటిని పాటించేటట్లు ప్రభుత్వమే చేయవలసి ఉంటుంది. కానీ అలా జరగడం లేదు అందువలననే సామాన్యులకు ప్రభుత్వ ఆస్పత్రులమీద నమ్మకం పోయింది. ప్రభుత్వ ఆస్పత్రికి వెళ్ళే 'సాహసం' చేయలేక, ప్రైవేటు వైద్య 'సేవల్ని' భరించలేక తికమక పడుతున్నాడు సామాన్యుడు. గ్రామాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి ఒక సామా న్యుడు వైద్యానికి వెళితే, ఒకసారి వైద్యుడు ఉండడు, ఆయన ఉంటే మందులు ఉండవు. ఒకవేళ ఉన్నా మందులు ఇచ్చేవారు లేక ఇతర వైద్య సిబ్బంది ఉండ రనేది అనేకమంది గ్రామీణప్రాంత రోగులు చెప్పే ఫిర్యాదు.

డాక్టర్లు సంఖ్యాపరంగా తక్కువ లేకపోయినా సరియైన పంపకం జరగకపోవడం కూడా వైద్యలోపానికి ఒక కారణం అవుతుంది.

గత 15, 20సంరాలుగా వైద్యం కొరకు సమాజం పెట్టే ప్రతి వంద రూపాయల ఖర్చులో 70 రూ॥ ప్రైవేటు రంగానికి వెళుతుందని సర్వేలు తెలుపుతున్నాయి. ఉదా నిజామాబాద్ జిల్లానే తీసుకుంటే నిజామాబాద్ జిల్లాలో జిల్లా కేంద్ర ఆసుపత్రి, వివిధ ఏరియా ఆసుపత్రులు, కమ్యూనిటీ హెల్త్ సెంటర్లు, ప్రాథమిక వైద్య కేంద్రా అన్నింటిలోను కలిపి సుమారు 1100 పడకలు అందు బాటులో ఉన్నాయి. కానీ ప్రైవేటు రంగంలో ఒక నిజామాబాద్ టౌన్లోనే సుమారు 1100 పడకలు అందుబాటులో ఉన్నాయి. (30 సం॥ల క్రితం నిజామా బాద్ టౌన్లో ప్రైవేట్లో 100 పడకలకు మించలేదు). ఇంకా కామారెడ్డి, ఆర్మూర్, బోధన్ ఇతర మండలాలు కలిపితే 1500 పై చిలుకు ఉండవచ్చును. అంతేకాక ప్రైవేటురంగంలో 70 శాతం పైగా పడకలు నిండి పోతుంటాయి. ప్రభుత్వ రంగంలో ఒకటి రెండు ముఖ్యమైన ఆసుపత్రులు తప్ప మిగతా వాటిలో చాలా ఖాళీలు ఉంటాయి. దీన్నిబట్టి ప్రైవేటు వైద్యరంగంపై ఎంత ఒత్తిడి ఉంటున్నదో అర్థం అవుతుంది. ఆమేరకు ప్రైవేటురంగంపై బాధ్యత కూడా పెరిగినట్లే. అలాగే ప్రభుత్వరంగంలోని ఆసుపత్రులపై నిరాశ, నిర్లిప్తత పెరగడం కూడా మంచిది కాదు కదా.

అయితే పెరిగిన బాధ్యతను నిభాయించడానికి (ఫీజులు తీసుకున్నా కూడా) సరియైన వాతావరణం ఈనాడు కనిపించడం లేదు. అటు ప్రజానీకంలో నిరక్షరాస్యత, అజ్ఞానం, మూఢనమ్మకాలు, పేదరికం ఎక్కువ వుండటం వలన పరిస్థితిని సరిగ్గా అర్థంచేసుకోక పోవడం, సమయానికి వైద్యం చేయించుకో(లేక)క పోవడం, మందులు సరిగా వాడలేక పోవడం జరుగు తుంది. కాగా జరిగిన ప్రతి వ్యతిరేక సంఘటనకు, లేక దుర్ఘటనకు వైద్యున్ని బాధ్యున్ని చేసి వ్యక్తిగతమైన నష్టం లేక ఆసుపత్రికి నష్టం కలుగజేస్తున్నారు.

మరొకప్రక్క తక్కువ సమయంలో ఎక్కువ ఆదాయాన్ని ఆశించి గాని, వైద్యరంగం వ్యాపారమయమైపోయి 'పెట్టుబడి– లాభం' లెక్కలు పెరిగినందువలన గానీ, అనారోగ్యకరమైన పోటీలు పెరిగినందువలన గానీ వైద్యుడు – రోగి మధ్య సంబంధాలు పటిష్టంగా ఉండటం లేదు.

అత్యంత వేగంగా విస్తరిస్తున్న అధునాతన వైద్య పరిజ్ఞానం, ఎంత పెద్ద జబ్బునైనా లొంగదీసుకునే అవకాశాన్ని కల్పిస్తుండగా, మరొకవైపు ఆ అవకాశాన్ని అందిపుచ్చుకునే శక్తి కొద్దిమంది మాత్రమే కలిగి ఉంటున్నారు. ఖర్చు పెట్టలేని వాడు కూడా ఆరోగ్యంగా ఉండాలనే అనుకుంటాడు. తక్కువ ఖర్చుతో అధునాతన వైద్యం కావాలనుకుంటున్నాడు. తనకు కూడా ఆ శక్తిని కల్పించాలని ప్రభుత్వాన్ని సమాజాన్ని కోరుతున్నాడు. సాధ్యంకానప్పుడు కోపాన్ని, ద్వేషాన్ని పెంచుకుంటున్నాడు.

చివరకు జరుగుతుందేమిటంటే మానవ సంబంధాలు చెడిపోతున్నాయి. వైద్యరంగంపైన అనుమానం పెరుగు తుంది. అది ఏ రకంగానూ మంచిది కాదు.

కనుక ఏం చేయాలి – ప్రభుత్వరంగం పటిష్టం కావాలి. మొదటి ఉదహరించిన, ప్రభుత్వ పరంగా చేయవలసిన అంశాలన్నింటినీ ప్రభుత్వం అత్యవస రంగా, గుర్తించి నిర్వహించాలి. ఆరోగ్యం ప్రజలందరి ప్రాథమిక హక్కు అని గుర్తించాలి. అలాగే ప్రైవేటు రంగంలో వ్యాపార లక్షణంతో పాటు మానవ విలువలు పెరగాలి. రోగంతోపాటు రోగిని, రోగి కుటుంబ పరిస్థితిని కూడా అర్థంచేసుకోవాలి. తన శక్తి మేరకు కృషి చేస్తున్న విషయం అవతలి వారు గుర్తించేటట్లు ప్రవర్తించాలి. ప్రజలు వైద్యులపై విశ్వాసాన్ని పెంచు కోవాలి. పాఠశాల స్థాయిలో ఆరోగ్య విద్య పెరగాలి.

ఇప్పుడిప్పుడే విస్తరించుకుంటున్న ఇన్సూరెన్స్ రంగాన్ని వైద్య రంగానికి ఏరకంగా ఉపయోగించ వచ్చునో ప్రభుత్వం పరిశీలించి, దానిలో దాగిఉన్న లోపాలను సరిచేయాలి. ముఖ్యంగా బీద జనానికి ఉపయోగపడేటట్లుగా ప్రభుత్వమే చూడాలి.

అవసరమైన మేరకు ప్రైవేటు రంగాన్ని ప్రభుత్వం నియంత్రించాలి. జనంలో వైద్య పరిజ్ఞానం పెంచటానికి మీడియా, ముఖ్యంగా కంప్యూటర్ పరిజ్ఞానం ఉపయోగ పడాలి. (తద్వారా వైద్యానికి, రోగికి (రోగి కుటుంబానికి) మధ్య స్నేహ సంబంధాలు పెరగాలి). అప్పుడే కోట్లాది అనారోగ్య పీడితులకు వైద్య రంగం ఒక ఆశాకిరణం అవుతుంది. వైద్యులకు చికిత్స చేయడంలో సంతృప్తి కలుగుతుంది.

# ప్రజాసేవకులు డాక్టరుగారు

– శ్రీ మోపర్తి సదాశివరావు

అజాతశత్రువు, ఆజానుబాహుడు, స్ఫురద్రూపి, మహామనిషి, పేదలపాలిటి పెన్నిధి మన డాక్టరు గారు. "కష్టేఫలి" అనెడి నానుడికి అక్షర సత్యం మన డాక్టరు గారి జీవితము. అడిగిన వారికి లేదనకుండ, అడగని వారికి సైతం వారివారి కుటుంబ ఆర్థిక పరిస్థితులను తెలుసుకొని ఎంతోమందికి విద్యాదానము చేసి, వారు ఉన్నత శిఖరాలను అధిరోహించటానికి తోడ్పడిన మహా మనిషి మన డాక్టరు గారు. అందరూ ముద్దుగా పిలుచుకొనే "పెద్దాయన" అనే పిలుపుకు సార్థకతను చేకూర్చిన నిగర్వి మన డాక్టరు గారు.

రామచంద్రపాలెం గడ్డపై జన్మించి, తక్కెళ్ళపాడు గ్రామములో పెరిగి పెద్దవాడై మంచి వైద్యునిగా పేరు ప్రఖ్యాతులు గడించి, రెండు గ్రామాలపేర్లకు జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో గుర్తింపు తెచ్చిన మన డాక్టరుగారి గొప్పతనానికి గ్రామ ప్రజలు సదా ఋణపడియున్నారు.

కడు నిరుపేద కుటుంబములో జన్మించి, మేనమామ సహకారంతో వైద్య, విద్య నభ్యసిస్తూ, మరొక ప్రక్క కుటుంబ భారాన్ని మోస్తూ, దిగ్విజయంగా వైద్యవృత్తిలో పట్టాను పుచ్చుకొని, ధర్మపత్ని డా॥ జయప్రదాంబ గారితో కలిసి గుంటూరులో పీపుల్స్ వైద్యశాలను ఏర్పాటుచేసి, ఎందరెందరో అభాగ్యులకు, అనాధలకు ఆరోగ్యాన్ని ప్రసాదించిన కలియుగ దేవుడు.

ప్రతి పురుషుడి విజయరహస్యం వెనుక ఓ స్త్రీశక్తి దాగివుంటుంది అని తలపండినవారి ఉవాచ, అది అక్షర సత్యం. డా॥ జయ ప్రదాంబగారు ఒక ప్రక్క కుటుంబ వ్యవహారాలను చక్కబరుస్తూ, మరొక ప్రక్క డాక్టరుగారికి చేదోడు వాదోడుగా వుంటూ, వారి కీర్తి ప్రతిష్టలకు పరోక్షంగా కారకులు. ఆ మహాసాధ్వి డాక్టరు గారికి ధర్మపత్ని కావటం మన డాక్టరుగారి అదృష్టంగా భావించాలి.వైద్య రంగంలోనే కాకుండా రాజకీయ, విద్యారంగాలలో డాక్టరుగారి సేవలు చిరస్మరణీయం.

బాంబుల మోతలతో దద్దరిల్లే పెదకూరపాడు నియోజక వర్గంలో శాంతికపోతాన్ని ఎగురవేసి, శాసన సభ్యులుగా విజయం సాధించి, రాజకీయ మేధావుల మన్ననలను పొందిన డాక్టరుగారి గొప్పదనం ఎంత చెప్పినా.. ఇంకొంత మిగులుతుంది. జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాల, రాయపాటి వెంకట రంగారావు ఇంజనీరింగ్ కళాశాల, పాటిబండ్ల సీతారామయ్య హైస్కూలు తదితర విద్యా సంస్థల స్థాపనలోను, వాటి అభివృద్ధిలోను డాక్టరు గారి సేవలు ఎనలేనివి. భార్య జయప్రదాంబ గారి పేరుతో బాలికలకు డా॥ జయప్రదాంబ డిగ్రీ కాలేజిని స్థాపించి, ఎంతోమంది. పేద బాలికలకు కంప్యూటర్ విద్య నందిస్తున్న డాక్టరు గారి సేవా దృక్పథాన్ని ఏమని పొగడగలం.

అంతటి మహామనిషి యువతకు మార్గదర్శకులు. వారి జీవితం నేటి యువతకు ఓ పెద్ద బాలశిక్ష లాంటిది. ఆ మహామనిషి మా గ్రామవాసి కావటం మాకు గర్వకారణం. అందుకే మా గ్రామములో డాక్టరు గారిని స్ఫూర్తిగా తీసుకొని మా గ్రామ యువత డా॥ కాసరనేని సదాశివరావు నాటక కళాపరిషత్తును స్థాపించి, 2002 నుండి నేటివరకు నిరాటంకంగా, రాష్ట్ర స్థాయిలో సందేశాత్మక, ఆహ్వాన నాటిక పోటీలను 3 రోజులపాటు నిర్వహించి, ప్రజల్లో మంచి చైతన్యము తీసుకు రావటానికి, మా వంతు కృషి మేము చేస్తున్నాము. ఎందరో డాక్టరు గారి అభిమానులు, శిష్యులు మా ఈ కార్యక్రమానికి సహాయ సహకారములు అందిస్తున్నారు. ప్రతి సంవత్సరము డాక్టరు గారు కొందరు పేద కళాకారులకు ఆర్థిక సహాయాన్ని అందిస్తున్నారు.

నేడు మన డాక్టరు గారి జన్మదినం. ఇలాంటి శుభ ఘడియలు మరిన్ని రావాలని ఆకాంక్షిస్తూ, సదా మీ బాటలో నడుస్తామని మీ అంత కాకపోయిన, సముద్రములో నీటి బిందువంతైన, సమాజసేవలో మేము భాగస్వాములము అవుతామని తెలియజేస్తున్నా....

# సాహితీ పోషకులు : డాక్టరు సదాశివరావుగారు

శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు
'భావవీణ' సంపాదకులు

మన సంస్కృతి విశిష్టమైనది. అది పరహిత పరోపకార పరాయణత్వమును, హృదయ సంస్కారమును బోధించినది. కాని యీనాటి సమాజమున నీతి, పరోపకారము వంటి శబ్దములు కేవలము నిఘంటువులకే పరిమితమైనవి. ప్రతి వ్యక్తియు వానిని గూర్చి వేదికలపై గంటల తరబడి ఊకదంపుడు ప్రసంగములు కావించెదరు. ఆచరించు వారెందరు? వ్రేళ్లమీద లెక్కకు వత్తురేమో? మానవుని విలువ రూప సౌందర్యధనాదుల యందుండదు. శీలము నందు మాత్రమే కలదు. అటు వంటిశీల నైతిక వర్తనముగల్గిన గుణవంతులలో డాక్టరు కాసరనేని సదాశివరావుగారగ్రేసరులు.

సదాశివరావు గారు సదాశయులు. శస్త్రవైద్య నిపుణులు. విద్యావేత్త, స్నేహశీలి. ప్రజాస్వామ్య వాది. వ్యక్తి స్వేచ్ఛాభిలాషి, హితభాషి, మితభాషి, స్వయంకృషితో అభివృద్ధిలోకి వచ్చిన దొడ్డ మానిసి. ఆదర్శ వివాహజీవితము వారి సౌశీల్యము నినుమడింప జేసినది. "కర్షకకవి" శ్రీ చలసాని లక్ష్మీనారాయణ వర్మగారి పుత్రిక డాక్టరు జయప్రదాంబ గారు వీరి జీవిత భాగస్వామిని. ఈ దంపతులు ధనార్జనయే లక్ష్యముగా కాక సేవాభావముతో "ప్రజావైద్యశాల" ను ప్రారంభించి వైద్య వృత్తిని కొనసాగించిన దీన జనబాంధువులు. సామాన్యుల ఆర్తిని గుర్తించి ఆపదలలో చేయూత నిచ్చిన మాన్యులు, అందులకే కాబోలు

**కాసరనేని దంపతులు కాసుల కంటెఁ బ్రజా సపర్యకున్**
**వాసి యొసంగి రేపవలు వందురు వందలవేల రోగులన్**
**గాసికి దవ్వొనర్చి నవకాంతి సమగ్రులఁజేసి ధన్యతా**
**భాసురులౌట సజ్జనులు పాలిటికిన్ శుభవార్తయై తగున్.**

అని "తెనుఁగులెంక" శ్రీ తుమ్మల సీతారామమూర్తి గారు వారిని కొనియాడుట విశేషము.

బహువిషయములపై డాక్టరు గారికి గల పరిజ్ఞాన మాశ్చర్యకరమైనది. సాహిత్యాధ్యయనము పట్ల గాఢమైన అభినివేశము గలిగించు వారి సంభాషణలో మధురహాస్యముతో పాటు చెణుకులు తొణికిస లాడును. వారి వ్యాఖ్యలు ఆసక్తికరముగా, విజ్ఞాన దాయకముగా నుండును. భాషా విషయమున సంప్రదాయవాదులైనను నవీనమును నిరసింపని సహృదయులు. సుప్రసిద్ధ ప్రాచీనాంధ్రునికాంధ్ర మహాకవుల కావ్యములలోని అనేక పద్యములు కంఠస్థములు. తిక్కన, శ్రీకృష్ణదేవరాయల కవితా వైదగ్ధ్యమునకు ముగ్ధులై వారల కావ్యములలోని ఆయా పాత్రల వర్ణనా వైదుష్యమును, వింత సొబగులను నిరూపించుచున్నప్పుడు పండితులకే విస్మయము గలుగును.

"క్రియా కేవలముత్తరమ్"– అను తత్వము గల డాక్టరు 'గారు ఒక్క చేతిమీదుగా నిన్నేండ్లు నడపిన "సాహితీ సదస్సు" నకు రాష్ట్రము నందొక ప్రత్యేక స్థానమున్నది. గుంటూరు పరిసర ప్రాంతములలోని వివిధ దృక్పథములు గల విద్యావంతులు, కళాభిమానులు తరచుగ కలసి కొనుచు వారి, వారి అభిరుచుల ననుసరించి ఆయా విషయములపై చర్చలు జరిపి సంప్రతింపులతో ఒకరి నొకరు – అర్థము చేసికొను ముఖ్యోద్దేశముతో 23–10– 1966 విజయదశమి నాడు– డాక్టరుగారి స్వగృహములో శ్రీ జి. జాషువా కవిగారి అధ్యక్షతన జరిగిన సమావేశములో సాహితీ సదస్సు"ను ఏర్పాటు చేయటమైనది. వివిధ విశిష్ట సాహితీ సిద్ధాంతములు, విభిన్న సాహిత్యాభిరుచులు గల్గిన కళారాధకులకు అందరికి నిదియొక చక్కని వేదికగా రూపొంది తెలుగుగడ్డ నలుమూలల ప్రశస్తి గాంచినది. ఇది శ్రీ సదాశివరావు గారి ఉదాత్తతకు నిదర్శనము.

ప్రముఖ సాహితీ మూర్తులు – అసామాన్య కీర్తి ప్రతిష్టలు సంతరించుకొనిన కవి పురందరులు తమ రమణీయ ప్రసంగములతో కమనీయ కవితాగానములతో శ్రోతల నలరించేవారు. సర్వశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, విశ్వనాథ

సత్యనారాయణ,  జాషువ, తుమ్మల సీతారామమూర్తి, కాళోజి నారాయణరావు, సి. నారాయణరెడ్డి, దివాకర్ల వేంకటావధాని, వానమామలై వరదాచార్యులు, నండూరి రామకృష్ణమాచార్య, కరుణశ్రీ, దువ్వూరి వేంకటరమణశాస్త్రి, పువ్వాడ శేషగిరిరావు, జమ్ములమడక మాధవరామశర్మ, 'పండిత గొట్టిపాటి వెంకటసుబ్బయ్య, భావరాజు నరసింహారావు, డి.వి. నరసరాజు, ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తి, శ్రీమతి నాయని కృష్ణకుమారి, శ్రీమతి కొత్త లక్ష్మీరఘురామ్, శ్రీమతి కొండ పార్వతీదేవి, శ్రీమతి యశోదారెడ్డి, శ్రీమతి కె. రామలక్ష్మి, ఆరుద్ర, జి.వి. కృష్ణరావు, కొత్త సత్యనారాయణ చౌదరి, సంజీవదేవ్, పండిత గోపదేవ్ శాస్త్రి, అమరేంద్ర, మరుపూడి కోదండరామరెడ్డి, ఆవుల సాంబశివరావు, తూమాటి దొణప్ప, లింగం వీరభద్రయ్య చౌదరి, నాగళ్ల గురుప్రసాదరావు, కొండవీటి వేంకటకవి, వారు – వీరు అని యన నేల? ఎందఱో మహనీయులు సాహితీ సదస్సులో ప్రసంగించిరి. ఈ వేదికపై అనేక గ్రంథములు ఆవిష్క రింపబడినవి.

డాక్టర్ జయప్రదాంబగారి యెడల నాకు అపరిమిత గౌరవము. ఆ యమ్మ వ్యక్తిత్వము విశిష్టమైనది, విలక్షణమైనది. ఆదర్శగృహిణి: ప్రతి మాసము జరుగు, సాహితీ సదస్సమావేశానంతరము వచ్చిన కవి పండితులకు, బంధు మిత్రులకు వారి స్వగృహములోనే చక్కని ఆతిథ్యమిచ్చెడివారు. వక్తలను సత్కరించుట పరిపాటి. వారి నిరుపమ త్యాగమభినందనీయమైనది.

కవుల నాదరించి అనేక గ్రంథములను వెలుగులోనికి దెచ్చిన సాహితీ పోషకులు, స్వార్జితధనమును సయోగమొనర్చు వివేకవంతులైన డాక్టరు సదాశివరావు గారు వయస్సులో పెద్దలై అస్మదాదులకు సమకాలికులు. వారుచేయు దానధర్మములు సన్నిధానవర్తులకే తెలియును. వారి జీవితములోని మెఱుగులు పరిచితులకే అర్థమగును. వర్ణవైవిధ్యమన్న భేదభావము లేదు. కులగోత్రముల ధోరణియే కనుపింపదు. సర్వసమత్వము చూపనేర్చిన కళాపోషకులు. సంకల్పశుద్ధి, స్వార్థత్యాగముతో సత్కార్యములు గావించుచుండిరి. కొందరు దాతలు తాము చేయు పనులు నలువురకు తెలియవలెనని ఆరాటపడెదరు. గుప్త దాతలకున్న విలువ వారికి రాదు,"ప్రచారకాండ" యన్న బొత్తిగా గిట్టదు. వారొక చేతితో చేయు ఉపకృతి రెండవ చేతికి తెలియదు. పరహితమే వారి మతము, అభిమతము, పేదలకు చేయు మేలు కొంతవరకైన ఫలితమీయవలెనని వారి తాత్పర్యము. పరోపకారమే పుణ్యమను సూక్తిని జీర్ణించుకొనిన వారు గనుక నావంటి వారి నెందరినో అభిమానించి యాదరించిరి. వారి మధుర జీవితములోని పరిమళము పసికట్టిన వారిలో నేనొకడను.

దాదాపిది యేబది యైదేండ్ల నాటి మాట. నేనప్పుడు జబ్బుపడి ఒక మిత్రుని సూచనపై డాక్టరుగారి యొద్దకు వెళ్లితిని. నా యోగ క్షేమములరసి ముక్కు మొగము తెలియని నాకు ఉచితముగా శస్త్రచికిత్సచేసి" రుజా భారమ్ము పోకార్చి నన్నాయుష్మంతు నొనర్చె సత్కవి హితవ్యాపారపారీణతన్"– "నాఁటికి నేఁటికీ హృదిని నాటి చలింపని పుణ్యమూర్తికి" నా ఋణము దీర్చుకొనుటకై "పూఁదోఁట" అను చిన్న ఖండకృతిని అంకితమీయ దలచి వారి యనుమతిని పొంది నా సొంత ప్రెస్లో ముద్రించు కొనుచుంటిని. ఒకనాడు తలవని తలంపుగా డాక్టరు గారు హాస్పిటల్కు పోవుచు ప్రెస్ కడకు వచ్చి యేవో రెండుమూడు మాటలు మాట్లాడి వెళ్లుచు మెదలకుండ ఖర్చులకు కొంతడబ్బు నా జేబులో పెట్టి వెళ్ళిరి. ఆశ్చర్యపడితిని. ఏమీ దాతృత్వము! వారి నుండి నేనేమి ఆశించి చేసిన పనికాదు. అందులకై 1962 ఆగస్టు 5న స్థానిక శ్రీ ఏకాదండయ్య పంతులు హాలులో కృతి సమర్పణ సభ ఏర్పాటు చేసితిని. శ్రీ నార్ల వెంకటేశ్వరరావు గారు అధ్యక్షులు, శ్రీ జి. జాషువ, దీపాల పిచ్చయ్యశాస్త్రి, ఆవుల గోపాలకృష్ణమూర్తి, కన్నెకంటి వీరభద్రాచార్యులు, కొండవీటి వెంకటకవి ప్రభృతులు ఉపన్యాసకులు. సభానంతరము శ్రీ నాజరు దళము వారిచే "బొబ్బిలి యుద్ధము– బుర్రకథ. ఇంకేమున్నది హాలు క్రిక్కిరిసినది. శ్రీ ఏకా ఆంజనేయ పంతులు, శ్రీ పాములపాటి బుచ్చినాయుడు వంటి పెద్దలు, కవి పండితులెందరో సభకు విచ్చేసిరి. అంతటి సాహితీ సభ తిరిగి గుంటూరులో జరుగలేదనిన అతిశ యోక్తి కాదు.

శ్రీ ఆవుల సాంబశివరావు 4-8-62న ఒకలేఖ వ్రాయుచు "ఈ రోజుల్లో రచయితలకు కరువులేదు. వచ్చిన కరువల్లా సహృదయులైన రసికులలోనే. కృష్ణా రావుగారి కావ్యానికి కృతిభర్తగా రసపిపాసియైన సదాశివరావుగారు దొరకటం అదృష్టం. అదే విధముగ "పండిత చిన్నము రామయ్య చౌదరిగారు వ్రాసిన ఉత్తరములో పూజ్యులగు డాక్టరు శ్రీ సదాశివరావుగా పూఁదోఁట కృతి నంకితము గొనుట వారి సాహితీలోలతకు, రసికతకు మరింత వన్నెవాసులను గల్పించు కొన్నట్లయినది.

ఇట్టి సహృదయులు, విద్యాధికులునగు యువకులు కవితాపోషకులై సారస్వతరంగమునఁ బ్రవేశించుట నవ్యాంధ్ర కవితా వనవీధులలో దివ్యవసంత ముదయించుటగా భావింతును. ఆనాటి వారి యున్నతా కాంక్షలు అక్షరాల నిజమైనవి కదా!

1967వ సంవత్సరము ఏప్రిల్ 23న డాక్టరు గారి స్వగృహములో జరిగిన సాహితీ సదస్సమావేశములో "విద్వత్కవి" బోడెపూడి వెంకటరావుగారు 'పింగళి వారి శృంగార రీతులు" – అను అంశముపై నుపన్యసించుచు సుగాత్రీ శాలీనుల కథయందలి శృంగార రస ప్రసంగ వైశద్యము సదస్యులకు గిలిగింతలు గలిగించినది. ఉపన్యాసానంతరము ఆకృతిని జిన్నయయ్యు గుణాధికరూఢమైన "తృష్ణావర్తము" కావ్యమందలి "కృతి" పద్యములు చదివి  సదాశివరావు గారి కిచ్చిరి. ఈ యపూర్వ కృతి సమర్పణకు సభ్యులాశ్చర్య పడిరి. డాక్టరు దంపతులు ఊహించలేదు.  బోడేపూడి వారు గూడ నావలె వైద్యము చేయించుకొని

"అవధానం బెనయన్ జికిత్సలను నయ్యే వేళలందున్ సదాశివరాయుండు భిషగ్వరుండు నియతస్నిగ్ధాంత్యుండై కూర్చె" నతని కృతజ్ఞతగా నంకిత మిచ్చిరి. అందలి కృతిపద్యములలో నొకదానిని మూదలించెద:

స్మిత పూర్వముగ సుధా సేచనోత్సవముగ
మాటలాడగ నేర్చు మధురిమంబు
పెద్దల గరిమంబు పిన్నల పెరిమంబు.
గణియింపఁజాలిన గడుసుఁదనము.

ఆంగ్ల భాషా రూఢి నాంధ్రభాషా ప్రౌఢి
జెంది మోదించు రాసిక్య గరిమ
భోగభాగ్యస్థితి త్యాగశీలోన్నతి
కడఁదాఁక నెఱిఁగిన గఱగణికయు

నేకమై ప్రోధి గాంచి నా హృదయసీమ
బాదు కొల్పిన గౌరవ భావమేదొ
యీ చిదుతకబ్బమున్ మీకుఁ గృతి నొసంగఁ
బ్రీతి పూర్వంబు నన్నుం బ్రేరేచునయ్య!

సాహిత్యము జాత్యభ్యున్నతికి సూచికము. దాని వృద్ధికి కవులు కారకులు. కవులకు సాహితీపోషకులాదరువు. పదార్థమునకు జీవితము ముడుపుగట్టిన డాక్టరుగారి చేతి చలువ వలన నా మిత్రుడు, తెలుగు పండితుడు. శ్రీ బొద్దులూరు నారాయణరావు రచించిన 'రాధేయుడు' కావ్యము వెలుగు చూచినది. సాహితీ సదస్సులోనే  తుమ్మల సీతారామమూర్తి గారి అధ్యక్షతన కావ్యాంకిత సభ జరిగినది. మండేపూడి గ్రామవాస్తవ్యులు, హిందీ పండితులు, సాహిత్యరత్న' యడ్లపల్లి సీతారామయ్య గారు తాను రచించిన "వీరపాండ్య కట్టబ్రహ్మన" నాటకమును" ప్రజా వైద్యశిఖామణులు, సాహితీప్రియులు, సారస్వతపోషకులు, సరస రసహృదయులు, **సాహితీసదస్సు** స్థాపకులు, విద్వజ్ఞానాభిమానులు, దయార్ధహృదయులు, సాంఘికసేవాభిలాషియునగు డాక్టరు కాసరనేని సదాశివరావు గార్కి నా యీ ప్రథమపుష్పాన్ని సాదరాభిమానాలతో సమర్పిస్తున్నాను" అని పేర్కొని 1968లో అంకితమిచ్చిరి. దీనికి డాక్టరు అమరేంద్రగారు "ముందుమాట" వ్రాయుచు “ఇటువంటి రసవంతమైన నాటకాన్ని సారస్వత ప్రియులు, సహృదయులు, రసజ్ఞశేఖరులు అయిన డాక్టరు సదాశివరావు గారికి సమర్పణగా వెలయించుట సాహిత్య ప్రియులందరికీ ముదావహం" అని ప్రశంసించిరి. డాక్టరు రావి రంగారావు గారు "కలలో కవిత" అను మనోవైజ్ఞానిక వచన కవితల సంకలనము నొసంగిరి.

డాక్టరు మండువ నరసింహారావు (ఒంగోలు) గారు. తాను రచించిన "నా తెలుగు కవితా కుమారి" అను చిఱుకబ్బమును వైద్య రంగంలో కాలూని సేవలందించే భాగ్యము గలిగించిన గురుదేవులు డాక్టరు కాసరనేని సదాశివరావు, జయప్రదాంబలకు నేను సదా ఋణపడి వుంటాను. ఆ పుణ్యదంపతుల పాదపద్మములకే యీ కృతి సమర్పితం" అని అంకితమిచ్చిరి. డాక్టరుగారి పెద్దరికము

నభినందించుచు డాక్టరు **జెక్కంపూడి సీతారామారావుగారు** (చిలకలూరిపేట) రచించిన "**కర్షకవేదం**" అను గ్రంథము నంకితమిచ్చి గురుభక్తిని వెల్లడించుకొనిరి. అదే విధముగ రాజ్యసభ మాజీసభ్యులు పద్మశ్రీ **డాక్టరు యార్లగడ్డ లక్ష్మీప్రసాదు** గారు '**ద్రౌపది**' విమర్శ గ్రంథమును హైదరాబాదులో పెద్దఎత్తున ఏర్పాటుచేసిన సభలో శ్రీ సదాశివరావుగారికి అంకితమిచ్చి వారి యనుబంధమును ద్విగుణీకృత మొనర్చుకొనిరి.

రాజకీయాది రంగములందు నొసంగిన విరాళముల సంగతినటుండ నిండు. సాహితీరంగములో సహాయము పొందిన కవులెందరో చెప్పనలవిగాదు. కృష్ణాజిల్లా ముసునూరులో నెలకొల్పి అనేక పుస్తకములు ప్రచురించుచున్న "గోరా గ్రంథమాల" పోషకులుగా వ్యవస్థాపకులకు ప్రతి సంవత్సరము వార్షికముగా కొంత ధనసహాయము చేసెదరు. శ్రీ గుత్తా వీరరాఘవయ్య చౌదరి (పుష్పగిరి, చెన్నై) రచించిన రెండు మూడు గ్రంథముల ముద్రణకు తోడ్పడిరి. జాషువా కవిగారి పేర వారి స్వగ్రామములో ప్రభుత్వ సహాయముతో నిర్మింపదలపెట్టిన కాలనీకి స్థలమును కొనుగోలు చేయునప్పుడు కవిగారి కుమారి శ్రీమతి హేమలత గుంటూరు వచ్చి చేపట్టిన కార్యక్రమవివరాలు తెలుపగా సంతృప్తిగనే పంపించిరి. నన్నాదుకొనినటులే 'శతావధాని' కన్నెకంటి వీరభద్రా చార్యులు (పల్నాటి సోదర కవులు) 'కవిశేఖర' కె.సి. జాను, సిద్ధయ్య కవి మున్నగువారిని ఆదరించి ప్రోత్సహించిరి. మరి కొందరి పేర్లు గుర్తున్నవి. కాని వాని నిట నుటంకించుట సముచితము కాదని విడిచి పుచ్చెద. అన్యథా భావింపరని నా విశ్వాసము. ఏ కవియైన డాక్టరు గారిని సందర్శించి రిక్తహస్తములతో శూన్యహృదయముతో వెనుదిరిగి పోయినది నేనెరుగను.

డాక్టరు సదాశివరావుగారు రచనలో గూడ ప్రతిభావంతులు. 1960 నవంబరులో ఆచార్యరంగా గారి షష్టిపూర్తి సంచికలోని వ్యాసమును చదివి అచ్చెరువొందితిని. ఒకవైపు వైద్యరంగమున విశ్రాంతి నెరుగని కృషి సలుపుచు, వేరొక వైపు ప్రశంసాపాత్రమైన రచన లొనరించుట విశేషము, నా ఆనందమును పట్టలేక ఆనాడే ఒక అభినందన లేఖ వ్రాసితిని. ఆ వ్యాసము చదివినవారికి, వారి రేడియో ప్రసంగములు విన్నవారికి, ఇటీవల సంతరించిన "సదాశివమ్" స్వీయచరిత్రను చూచినవారికి వారి రచనా పాటవము స్పష్టము కాగలదు. వారి జీవనసాఫల్య అమృతోత్సవ శుభసందర్భమున నా మనఃపూర్వకాభివందనములు.

*"పుణ్యైర్యశోలభ్యతే"*

# నమో సదాశివా !

– డాక్టర్ వాసిరెడ్డి నాగేశ్వర ప్రసాద్, కుసుమ కుమారి

కళ్యాణశ్రీ హోమియో వైద్యశాల తెనాలి. ఆజానుబాహువు, అజాత శత్రువు, తమ అమృతహస్తాలతో మూడు దశాబ్దాల క్రితం మా కళ్యాణశ్రీ హోమియో వైద్యశాలను తెనాలిలో ప్రారంభించి, మా ఉన్నతికి మార్గదర్శకునిగా నిలిచి, గడచిన ఐదు దశాబ్దాలుగా తమ దివ్యహస్తాలతో లెక్కకు మిక్కిలిగా నూతన వైద్యశాలలను ప్రారంభించి, ఎందరో వైద్యుల మన్ననలను పొంది, నాటికి, నేటికి, ఏనాటికీ సాటిలేని మేటివైద్యునిగా వైద్యరంగానికే వన్నెతెచ్చిన ఆదర్శమూర్తిగా విరాజిల్లుతూ, ఎప్పటికప్పుడు తన భూతకాలపు అనుభవాలను భావితరాలకు వర్తమానాలుగా అందిస్తూ, నేడు వివిధరంగాలు, సంఘాలు, ప్రముఖుల ఆనందోత్సాహాల నడుమ నేత్రానందంగా జరుగుతున్న "జీవన సాఫల్య"అమృతోత్సవ అమృతాన్ని తన ఆనందభాష్పాలు సాక్షిగా ఆస్వాదిస్తున్న

కార్యదక్షులు, సమతావాది, రసమయజీవి, నేస్తగాడు, నిస్వార్థపరుడు, సజ్జనుడు, దానశీలుడు, శిపివిష్ణుడు, వదాన్యుడు, రాజన్నుడు, యశస్వి.

# పెదకూరపాడులో డాక్టరు గారు

– నాదెళ్ల అప్పారావు,పెదకూరపాడు

1984లో గుంటూరు పార్లమెంటరీ నియోజకవర్గము నుండి లోక్ సభకు తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా డాక్టర్ కాసరనేని సదాశివరావు గారిని పోటీచేయమని నాటి ముఖ్యమంత్రి నందమూరి తారకరామారావు గారు కోరియున్నారు. అప్పుడే లోక్ దళ్ పార్టీనుండి దేశం పార్టీలో చేరిన తాను టిక్కెట్టు కొరకే పార్టీ మార్చానని ప్రచారానికి తావివ్వకూడదనే అభిప్రాయంతో పోటీ చేయలేనని చెప్పడం జరిగింది. నాటి పరిస్థితులలో రాజకీయాలకు కొత్తవాడైన అభ్యర్థిని నిలపటం వలన కొద్దితేడాతో ఓడిపోవడం జరిగింది.

సదాశివరావుగారిని ఎంపిక చేసియున్నట్లయితే అప్పటికే గుంటూరు పార్లమెంటరీ నియోజకవర్గ పరిధిలోని అసెంబ్లీ నియోజక వర్గాలలో జనత, లోకల్ కేడర్ తో చక్కటి సంబంధాలు కలిగియున్నవారు కావున తప్పక గెలిచియుండేవారనేది నా నిశ్చిత అభిప్రాయం.

1985లో సదాశివరావుగారు పెదకూరపాడు అసెంబ్లీ సీటు కోరియుండలేదు. శ్రీ యన్.టి.ఆర్. తనకు తానుగా డాక్టరుగారిని పోటీచేయండి అని కోరియున్నారు. 1984లో పోటీకి దూరంగా ఉన్న తాను, ఇప్పుడు కూడా దూరంగా ఉంటానని చెప్తే శ్రీ యన్.టి.ఆర్. తనను ఏవిధంగా అనుకుంటారో అని బాధ ఒకవైపు, పార్టీని నమ్ముకొని టిక్కెట్టు ఆశిస్తున్న అర్హులైన స్థానికులకు అడ్డం తగలడం భావ్యం కాదనే భావన మరోవైపు, సంకటస్థితిలో ఉన్న డాక్టరుగారు తనకు తాను పోటీ చేయనని శ్రీ యన్.టి.ఆర్. డైరెక్టుగా చెప్పలేక, నాటి ప్రధానకార్యదర్శి శ్రీ ఉపేంద్రతో చెప్పగలనని తెలిపి యున్నారు. స్థానికుల సమస్యను గుర్తించిన శ్రీ యన్.టి.ఆర్. వారి సంగతి మేము చూసుకుంటాము, మీరు నామినేషన్ చెయ్యండని బి ఫారమిచ్చి పంపడం జరిగింది. ప్రచారం సందర్భంగా పెదకూరపాడు వచ్చిన నాటి ముఖ్యమంత్రి శ్రీ యన్.టి.ఆర్. ''డాక్టరు గారి సేవలను ఈ నియోజక వర్గానికే కాదు, ఈ జిల్లాకే కాదు, ఈ రాష్ట్రానికే వినియోగించుకోదలచాను'' అని బహిరంగ సభలో చెప్పారు. పెదకూరపాడు ప్రతినిధి చరిత్రలో మొదటి సారిగా మంత్రి అయ్యే అవకాశం రాబోతుందని మేము ఎంతో సంతోషించాము. కానీ పెదకూరపాడుకి ఆ అదృష్టం కలుగలేదు.

1985 శాసనసభ ఎన్నికలలో పెదకూరపాడు నియోజకవర్గ ప్రతినిధిగా డా॥ సదాశివరావు గారు ఎన్నుకోబడడం ఎంతో ముదావహం. అడవులు, వాగులతో నిండియున్న వెనుకబడిన ప్రాంతం పెదకూరపాడు నియోజకవర్గం. నాగార్జునసాగర్ నీటి పరీవాహక ప్రదేశమైయున్ననూ, ఎక్కువ భాగం కాల్వల చివరి భూములైనందున, పొలాలకు నీరందక రైతులు ఇబ్బంది పడుతున్న దశలో వృత్తిరీత్యా వైద్యుడైనా, ఆచార్యరంగా, చరణ్ సింగ్ వంటి గొప్పనాయకుల విధానాలకు ఆకర్షితుడైన సదాశివరావు గారు ప్రధానంగా నియోజకవర్గంలో వ్యవసాయ ఉత్పత్తులు పెంచడానికి ఇరిగేషన్ అభివృద్ధికి, మార్కెటింగ్ సౌకర్యాలు పెంచడానికి రహదారుల అభివృద్ధికి కంకణం కట్టుకున్నారు.

**ఇరిగేషన్ రంగం:**

కృష్ణానదిపై **అంబడిపూడి** వద్ద 32 లక్షల ఖర్చుతో 1323 ఎకరాలకు నీరందించే **ఎత్తిపోతల పథకం**, **లింగంగుంట్ల** వద్ద 33 లక్షల ఖర్చుతో 1300 ఎకరాలకు నీరందించే **జగడాల వాగు** పై 2 నీటి మళ్ళింపు పథకాలు, 26 లక్షల ఖర్చుతో **అందుకూరు** పరిసర ప్రాంతాలకు చెందిన 1800 ఎకరాలకు నీరందించే **ఎద్దు వాగుకు ఎత్తిపోతల పథకం**, **మునగోడు** సబ్ మైనర్కు నీటిని మళ్ళించే 8 లక్షల ఖర్చుతో 890 ఎకరాలకు ఉపయోగపడే **ఊటుకూరు మళ్ళింపు పథకం**, 30 లక్షల ఖర్చుతో 1300 యకరాలకు నీరందించే **సుడిగుండాల వాగు**పై నీటి మళ్ళింపు పథకం, కృష్ణానదిపై 29 లక్షల **ఖర్చుతో** 860 యకరాలకు నీరందించే పొందుగల ఎత్తిపోతల పథకం, **గాడిదలవాగు పథకాన్ని** ఎ.పి.యస్.ఐ.డి.సి వారిద్వారా చేపట్టబడడానికి తగినచర్యలు తీసుకొనడం,

ఎద్దువాగుపై **మొక్కపాడు వద్ద నీటి మళ్ళింపు పథకం** ఇంకా **కస్తల, మాదిపాడు, బలుసుపాడు, పథకాలకు అనుమతులు** పొందడం జరిగింది.

డా॥ సదాశివరావు గారు శాసనసభ్యుడు అయ్యేనాటికి మొత్తం నియోజకవర్గంలో ఉన్న ఏకైక ఎత్తిపోతల పథకం, **కస్తల–మునగోడు** పథకం మాత్రమే అదికూడా సహకార రంగ నిర్వహణలో మూలపడినందువలన ఆ ఎత్తిపోతల పథకం ద్వారా 9వ బ్లాకుతో కలిపితే **గణపవరం, రెడ్డిగూడెం** గ్రామాలకు చెందిన 2000 యకరాలకు నీటివసతి కల్పించే నిమిత్తం పరిశీలన జరిపించి, ఎస్టిమేట్లు వేయించి అనుమతి కోసం పంపడం జరిగింది. గుంటూరు జిల్లాలో నాటికి మంజూరైన ఎత్తిపోతల పథకాలలో ఎక్కువ బడ్జెట్ అనగా 1,28,00,000 (ఒక కోటి ఇరవై ఎనిమిది లక్షల) ఖర్చుతో, 2,100 యకరాలకు నీరందించే నిమిత్తం కృష్ణానదిపై **పుట్లగూడెం** ఎత్తిపోతల పథక నిర్మాణ ఆవశ్యకతను నాటి ముఖ్యమంత్రి శ్రీ యన్.టి.ఆర్. దృష్టికి తీసుకొని వెళ్ళి ప్రత్యేక అనుమతి పొందడం, స్వచ్ఛంద సంస్థలతో డాక్టరుగారు సంప్రదించి ఈ పథకం అనతికాలంలో పూర్తిచేయబడడానికి తగిన చర్యలు కూడా తీసుకున్నారు. నీటి వనరుల ఏర్పాటు జరుగుతున్న ఆ సమయంలో పుట్లగూడెం ఎత్తిపోతల పథకం డా॥ సదాశివరావుగారికి గొప్ప పేరు ప్రతిష్టలు తెచ్చిపెట్టింద నడంలో ఎట్టి సందేహం లేదు. అయితే డాక్టరు గారి కోరిక నేటికీ పూర్తి స్థాయిలో నెరవేరలేదనే అంశం గమనార్హం.

రహదారులు:

ఎన్నో సంవత్సరాలుగా అభివృద్ధికి నోచుకొనని, **అచ్చంపేట–మాదిపాడు** రహదారి, **బెల్లంకొండ – బోదనం**. రహదారి, **పొన్నెకల్లు–తాళ్ళూరు** రహదారి, **భీమినేనివారి పాలెం–పెదకూరపాడు** రహదారి, **క్రోసూరు–చంద్రాజుపాలెం** రహదారి, **త్యాళ్ళూరు – ధూళిపూడి** రహదారి, **ఓర్వకల్లు–వేల్పూరు** రహదారులను తారురోడ్లుగా అభివృద్ధిచేయడం జరిగింది. **సత్తెనపల్లి–బయ్యవరం** రహదారిని పూర్తి మెటల్ రోడ్డుగా కొంతమేరకు బి.టి. రోడ్డుగా, **ఊటుకూరు– అచ్చంపేట** రహదారిని మెటల్ రోడ్డుగా కొంతమేరకు బి.టి. రోడ్డుగా అభివృద్ధి పూర్తిచేయడం జరిగింది. అంచెలంచలుగా పై రెండు ముఖ్యరహదారులు బి.టి. రోడ్లుగా అభివృద్ధిచెంది యున్నవి. **పెదకూరపాడు– రామాపురం** కచ్చారోడ్డుని, **పెదకూరపాడు–గుజ్జర్లపూడి** కచ్చారోడ్డుని, **కొండూరు** కచ్చారోడ్లను మెటల్ రోడ్లుగా మార్చుటకు అనుమతులు పొంది నిధులు సమకూర్చబడి కొన్ని రోడ్ల పనులు ప్రారంభించబడి యున్నవి. **రెడ్డిగూడెం నుండి ఇనుమెట్ల మీదుగా నకిరికల్లు అడ్డరోడ్డు** వరకు రోడ్డు నిర్మాణం చేపట్టబడింది. **నెమలిపురి నుండి బి.బి.సి. కెనాల్** వరకు అవులడొంకను రోడ్డుగా అభివృద్ధి చేయడం, కల్వర్టును నిర్మించే ప్రతిపాదనలు మంజూరై పనులు ప్రారంభించబడినవి.

అనేక సంవత్సరాలుగా విజ్ఞప్తుల రూపంలోనే మిగిలియున్న అమరావతి– క్రోసూరు ఆర్. అండ్.బి. రోడ్డులో 17వ కిలోమీటరు వద్ద ఎద్దువాగుపై బ్రిడ్జి నిర్మాణ విషయంలో పట్టుదలతో డా॥సదాశివరావు గారు నాటి ఇంజనీరింగ్ ఇన్ ఛీఫ్ గారిని, సైటుకి తీసికొనివచ్చి బ్రిడ్జి నిర్మాణ ఆవశ్యకతను వివరించి అంచనాలు వేయించి ప్లానులో చేర్పించారు. 1989 నాటికి సాంకేతిక పరమైన అనుమతులు పొంది పాలనాపరమైన అనుమతులు కొరకు ఫైల్ పెట్టబడియున్నది. ఇన్ని రహదారుల అభివృద్ధి, ఎద్దువాగుపై బ్రిడ్జి నిర్మాణ కార్యక్రమము చేపట్టబడడానికి, డాక్టరుగారికి నాటి ఇ.యన్.సి గారికి ఉన్న వ్యక్తిగతమైన మైత్రీ బంధం ఎంతో దోహద పడింది. డాక్టరు గారి నీతి, నిజాయితీని గుర్తించిన అధికారులు డాక్టరుగారి మాటకు ఎంతో విలువ ఇవ్వడం జరుగుతుండేది.

శాశ్వత గృహాలు:

**నందిరాజుపాలెం, బెల్లంకొండ, చంద్రాజుపాలెం, పాపాయిపాలెం, ఎమ్మెజీగూడెం, కోళ్ళూరు, అచ్చంపేట, పెదపాలెం, అంబడిపూడి, కస్తల, తాళ్ళచెరువు, చౌటపాపాయిపాలెం, బలిజేపల్లి, లక్ష్మీపురం తండా, కోట నెమలిపురి, రాజుపాలెం, దిడుగు, పాటిబండ్ల, తాళ్ళూరు. కాపాడు, కంభంపాడు, లగడపాడు, రామాపురం, తమ్మవరం, జలాలపురం, మొదలగు గ్రామాలలో బడుగు బలహీన వర్గాలవారికి శాశ్వత గృహనిర్మాణం** క్రింద నిర్మాణం చేయబడినవి. **యస్. సి. లకు** క్రొత్తగా ప్రభుత్వంచే యివ్వబడిన స్థలాలలో **మండెపూడి** గ్రామంలో 100 కు పైగా గృహాల సముదాయాన్ని డాక్టరు గారు శంకుస్థాపన చేసి నిర్మాణం

పూర్తిగావించారు. అదేవిధంగా **గుండ్లపల్లి** దాని శివారు **తండాలలో ఒకేసారి 400 ఇండ్లు** మంజూరు చేయబడినవి. ఇది జిల్లా చరిత్రలోనే అరుదైన ఘట్టం. లోతట్టు ప్రాంతమైనందున, ఇండ్లలో చిత్తడి ఏర్పడి నివాసం చేయుటకు యిబ్బంది పడుచున్న రామాపురం గ్రామప్రజల అవస్థలను చూసి చలించిన డాక్టరు గారు, ఊరు ఊరంత మెరక ప్రాంతానికి తరలించి ఇండ్ల స్థలాలను యిప్పించిన ఘనత మరువరానిది. ఇండ్లస్థలాలు యిచ్చిన వారందరికీ శాశ్వత గృహనిర్మాణం చేపట్టటానికి డాక్టరు గారు ముందుకు రాగా, ఇండ్ల స్థలాలు పొందిన వారు ఆర్థిక ఇబ్బందుల వలన ఆ అవకాశాన్ని వినియోగించుకోలేక పోయినారు.

చంద్రాజుపాలెం ప్రాథమికఆరోగ్య కేంద్రం మినహా అన్ని మండలకేంద్రాలలో ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలను డాక్టరు గారి హస్తవాసిని గమనంలో పెట్టుకొని, ఆయన అమృ హస్తాలతో ప్రారంభించబడే విధంగా కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి. మండల కేంద్రాలలో పోలీస్ స్టేషన్లు, బస్ స్టేషన్లు మండల పరిషత్ భవనాలు, సంక్షేమ వసతిగృహాలు మంజూరు చేయబడి కొన్ని నిర్మాణ దశలో ఉన్నవి. 20 లక్షల ఖర్చుతో అచ్చంపేట రక్షిత మంచినీటి పథకం శంకుస్థాపన చేయబడి, పూర్తిచేయబడినది. **బోదనం, కంభంపాడు, అబ్బరాజుపాలెం, దిడుగు, దొడ్లేరు, చంద్రాజుపాలెం, పి.డబ్లు... స్కీములు** అమలు లోనికి తీసుకొనిరాబడ్డాయి. **క్రోసూరు, తాళ్ళచెరువు, లింగంగుంట్ల మున్నగు గ్రామాల మంచి నీటి స్కీములు** ఆమోదింపబడి పనులు మొదలు పెట్టే దశలో ఉన్నవి. గత పాలకుల హయాంలో ఈ నియోజక వర్గంలో పెదకూరపాడు, అచ్చంపేట, క్రోసూరు, గుండ్లలాంటి పెద్ద గ్రామాలలో సైతం కనీసం ఒక లక్ష రూపాయల ఖర్చుతో నిర్మించబడిన ప్రభుత్వ భవనాలు లేవు. డాక్టరు గారి హయాంలో మండల వ్యవస్థ ప్రవేశపెట్టబడి, ప్రజల ముంగిటపాలన పేరుతో అనేక ప్రభుత్వ కార్యాలయాలు ఏర్పాటు చేయబడి, వాటిలో కొన్నింటికి లక్షల ఖర్చుతో భవనాలు కూడా నిర్మించబడినవి. డా॥ సదాశివరావు గారు ఎప్పటికప్పుడు జిల్లాపరిషత్ అధికారులతో సంప్రదిస్తూ పాఠశాలలో ఉపాధ్యాయుల కొరత లేకుండా చూసేవారు. అదేవిధంగా అవసరమైన మేరకు తరగతుల గదులు నిర్మాణం చేయబడినవి. మండల కేంద్రాలలో హరిజన, గిరిజన వెనుకబడిన తరగతుల వారి సంక్షేమ నిమిత్తం సంక్షేమ వసతి గృహాలు మంజూరు చేయించి వారి చేతులమీదుగా ప్రారంభించారు. ఆదర్శమండలంగా అచ్చంపేట మండలాన్ని గుర్తింపజేసి 40 లక్షల నిధులతో గురుకుల పాఠశాల మంజూరు చేయించినారు. స్థల విషయంలో అడ్డంకి ఏర్పడినందున నిర్మాణ పనులు ప్రారంభించ బడలేదు. తరువాత నిర్మాణం పూర్తి అయినది.

డా॥ సదాశివరావు గారి చేతులమీదుగా పెరకూరపాడు గ్రామంలో పంచాయితీ భవనం, పాల కేంద్రం భవనం, ప్రాథమిక పాఠశాల భవనం, ఆర్టీసీ బస్ స్టేషన్, ప్రారంభోత్సవాలు జరుపుకున్నాయి. 8 లక్షల ఖర్చుతో యస్.సి. బాలికల సంక్షేమ హాస్టల్ శాశ్వత భవనం శంకుస్థాపన చేయబడి నిర్మాణం పూర్తి చేయబడగా, దీనిని సి. జనార్ధనరెడ్డి గారు ప్రారంభోత్సవం చేసినారు. సబ్–ట్రెజరీ, పి. హెచ్.సి. వెనుక బడిన తరగతుల సంక్షేమ వసతిగృహం డాక్టరుగారిచే ప్రారంభించబడి శిధిలావస్థలో ఉన్న పాత పోలీసు క్వార్టర్ల స్థానే క్రొత్త పోలీసు క్వార్టర్సు నిర్మాణానికి నిధులు మంజూరు చేయబడి నిర్మాణం జరిగింది.

డా॥ కాసరనేని సదాశివరావుగారి నిర్విరామకృషి ఫలతంగా పెదకూరపాడు నియోజకవర్గం సర్వతో ముఖాభివృద్ధి చెందినది.

డాక్టర్ సదాశివరావు గారు వృత్తిరీత్యా వైద్యుడైనా, ప్రవృత్తి రీత్యా సాహితీప్రియుడైనా, గ్రామీణ ప్రాంతాల అభివృద్ధికీ ముఖ్యంగా సాగునీటి వనరులు, త్రాగునీటి వనరులు, గ్రామీణ రహదారుల విషయంలో చేసిన కృషి మరువలేనిది. నేటికీ వారి నిస్వార్థ సేవకు, నిజాయితీకి, చిత్తశుద్ధికి, ప్రజలంతా జేజేలు పలుకుతున్నారు.

# A LIVING DHANVANTARI

Dr. Y. Lakashmana Swamy
Sanjivi Orthopedic & Physiotherepy Centre
Lakshmipuram, Guntur

I feel it my good fortune to write a few words about Dr. Kasaraneni Sadasiva Rao, who can be aptly called as 'Living Dhanvantari''. He is a physician and surgeon par excellence. He is a man of haves –a doctor, a humanist, a connoisseur of literature, an educationist, a writer and a speaker – all rolled into one.

Humanity and humility are the hall marks of his life. He is a man of uncompromising principles. He has maintained high standards of ethics in his professional as well as his personal life. He is known for his many unremembered acts of kindness and love. He never finds fault but always finds a remedy. In him there is a blending of genius and generosity, charity and compassion. His life is the success story of dedication and devotion.

He is a man of vision and practicality. He never lived in ivory towers. He is familiar with want and suffering. He never thinks or talks ill of others. He believes serving hands are more pious than those praying hands. He has left his personal mark on all that he said and did. He has faced the ups and downs of life with courage and conviction. He is well thought of across the board both as a doctor and as a man. He is respected for his winning manners and disarming simplicity. His achievements in his professional, as well as in his personal life, have been envy and despair of many.

Dr. Sadasiva Rao is a colossus in the medical world. As a doctor he is known for his punctuality and availability. He belongs to the vanishing generation of doctors who kept service above self and self. He never betrayed the faith of his patients. His fees are low and his treatment is simple. He is a doctor with a heart. Principles and professional ethics are dearer to him than monetary gains. As a doctor he is interested more in feeling the pulse than in fleecing his patients for their money. As a surgeon he is known for is skill and speed. He is good at relieving pain and providing comfort to his patients. The ailing come to him and go away hale and healthy with little expense and great relief. His diagnostic methods are simple, and his fees are moderate. He has many qualities worthy of emulation by the upcoming doctors. Dr. Rao is not only a good surgeon but also an efficient teacher. As the Honorary Surgeon at the Government General Hospital, Guntur, he taught. Undergraduate as well as Post Graduate students He trained many young surgeons in his own Nursing Home. He helped many to gain mastery in surgery. As a doctor he is revered and admired by many of his students. The Doctor has opened many Nursing Homes of his students in and around Guntur. Dr. Rao may be called the 'Doctors' Doctor'. The young doctors of today will make him proud if they follow his principles and that is the best way

of honouring him. I fondly hope that the young Doctors of today will keep him as their role model and serve the poor.

Dr. Rao's interests are wide and varied. If medicine is his vocation, fine arts are his avocation. He has founded the "**sahithi sadassu**" a literary association to promote and spread good and great literatures. Next to literature, drama is dearer to his heart. His Love for drama is so intense that he organized the staging of many plays in his village. He has honoured many artists. He has also arranged many '**Kavi sammelanams**' and honoured great poets. All this goes to prove his great passion for friends.

His love for education is proverbial. He is associated with the founding of many educational institutions. He is the moving spirit behind The Nagarjuna Education Society. His aim has been to take education to the doorsteps of the people living in remote villages. The spread of education has been his mission. Ill health has not deterred his zeal for service.

He has been a loving and devoted husband, He and his wife are a couple made for each other. As a typical "HINDU DHARMAPATNI" his wife stood by him through thick and thin. She managed her family and children with care and compassion. The premature death of his wife has been a great tragedy in his life. The death of his wife did not alter their bond. In order to perpetuate her memory Dr. Rao has started a college in her name. He still has many plans to develop the college into a PG. centre offering many courses.

Dr. Rao has also taken active part in politics for sometime. He has been elected as a legislator. He could not stay longer in Politics as he found himself a square peg in a round hole. His political life has brought him new friends among national leaders.

Dr. Rao is a multifaceted personality. There is in him a formidable combination of a good head and a good heart. Success and power never got into his head. Crown and renown are of little to him. He is always simple, straight forward, and affable. He is fond of company and conversation.

I wish the doctor many more years of fruitful service to society.

Sincerity and simplicity produce the best kind of dignity – Victor Hugo
We may foreknow destiny, but we can not escape it. Shakespeare

## DOCTOR-PATIENT RELATIONSHIP
THE NEED TO PROMOTE ETHICS

Dr. K. VASUDEVA RAO,
N.R.I. Medical College

Of all the professions in the world, the healing profession is always held in high esteem from times immemorial, the medical men and women came out with remedies and operations to minimize or cure the effects of sickness. Their contributions to the promotion of health and increasing longevity have been phenomenal over the centuries. This prompted a writer like R.L. Stevenson to remark "The Doctor is the flower of our civilization".

One important area in the delivery of health care is the "doctor-patient relationship". There have been comments aplenty in recent times to say that it is receding. Some authorities who studied the issue in detail prescribed the required solutions also. This essay deals with these and related matters.

Dr. Sadasiva Rao and Dr. Jayapradamba who established their 'Peoples' Nursing Home' in Guntur in 1951 rendered pioneer service to the people of the Guntur District and neighbouring areas. They provided the best of attention and care on all the sick people who sought their help. They are always held in high esteem because of the values and ethics they contributed to Dr. Sadasiva Rao Garu wrote an excellent essay on 'How to become a successful general practitioner' in 1961. It outlines several qualities that the practicing Doctor should possess and deploy them in the promotion of health standards in the community. This essay has more relevance today. Let us examine some issues related to the Doctor-Patient Relationship and the inevitable need to promote ethics.

Medicine was an art. It remained so, for several centuries. Susrutha, Charaka, Hippocrates, Galen, Paracelsus, and Avicenna perfected the art and trained several generations of votaries of the healing art. Then medicine got transformed into a science. In the late 17th and early 18th centuries Harvey, Pickering, Pasteur, and Claude Bernard laid solid foundations for the scientific aspect of medicine. They based their theories on the principle of "cause and effect". Francis Bacon's 'Novum Organum' was a guiding light. The advancement of Physics and Chemistry helped medicine to convert itself from an empirical craft to a scientific discipline. Measurement was given importance. Doctors started measuring temperature, pulse rate, blood pressure, blood glucose etc.

Medicine became a technology in the early 1950's. Thus, electrocardiography, heart-lung machine, the artificial kidney. EEG, autoanalyzer, radiation therapy have ushered in a significant revolution. Gradually organ transplantation has become a common place event. Imagining has been replaced by imaging Ultrasonography, CT, MRI, PET and Thallium scans

